

నల్లంతిఘళ్ చక్రవర్తుల

తంయాల లక్ష్మీనృసింహాచార్యులవారు

గ్రంథకర్త.

# తొలి పలుకు



అక్షీనవరూపశేఖరులారా !

ఈ ప్రబంధమిప్పటికి కిరువదైదు వత్సరములు క్రిందటనే నెరవేరెను. కావ్యరచన కిదియే నూతనప్రవృత్త్యగుటచే, (ప్రమాదో ధీమతామపి) యను న్యాయానుసారము, ప్రమాదములుండు ననుసంశయంబున ప్రచురింప నిచ్ఛబొడమకుండెను. క్రమక్రమముగా ఇంక కొన్ని గ్రంథములు విరచింపగలిగినందులకు మిత్రులెందరో యీ గ్రంథముద్రణాకై ప్రోత్సాహమొసగించిరి. సవరింపులు కానందున గ్రంథముద్రణానుకూల ద్రవ్యాభావంబున కాలవిళంబనమయ్యెను. నా కాలంబున పండితపుంగవులీ పొత్తమును వీక్షించి ముద్రణాప్రయత్నప్రోత్సాహమొసగించిరి. వారి నాగ్రహము తప్పనిసరై అట్టి తరుణంబుననే ముద్రణద్రవ్యం బొసంగెదమని కటకం నృసింహ వీరన శెట్టిగారలు, వాగ్దానమొసర్చిరికాని నాగృహపరిస్థితులచే వత్సరద్వయకాలంబతీతమైనది. అది మొదలీవరకు మరలి కావ్యమును ముద్రణస్థితిలోనికి దెచ్చి ముద్రింపగలిగితిమి.

ముద్రణాసమయమున మేము స్థానాంతరస్థితులమగుటచే సవరణ బహుళమైనను ముద్రణాస్ఖాలిత్యము లుండుననుగాన పాఠకులు యథామతిగ సంప్రతించుకొన ప్రార్థితులు.

ఇట్లు విన్నవించునది

గ్రంథకర్త, నివాసస్థానము

ఓమంగల్లు.

# పీఠిక

శ్లో॥ అపారేకావ్యసంసారే । కవిరేకః ప్రజాపతిః ।
యథాస్మైరోచతే విశ్వం । తథేదంపరికల్ప్యతే ॥

రసికవతంసులారా,

కావ్యప్రపంచము నిరవధికమైనది. కవి తనమనశ్శక్తి ననుసరించి కవితాశిల్పకళ నుపదేశించును. కవీంద్రుఁడు తన మనోరథము ననుసరించి విధాతవలెఁ గావ్యప్రపంచము నిర్మించును. కవులకల్పనాశక్తి ప్రతిభాతరంగముల నూగులాడుచుండును.

శ్లో॥ శృంగారీ చేత్కవిఃకావ్యే । జాతం రసమయంజగత్ ।
సచేత్కవిర్వీతరాగో । నీరసంవ్యక్తమేవతత్ ॥

కవి శృంగారరస పరతంత్రుడైన కావ్యములుగూడ శృంగార స్రవంతి ననగాహన మొనర్చుచుండును. కవి విరాగియైనచో గావ్యములుగూడ నీరసముగా నుండును. నీరసముగా నుండు కావ్యములు సహృదయహృదయరంజకములు కానేరవు. చమత్కృతిరహితములగు కావ్యములు తృణపురుషసదృశములు.

పాఠకులకు హృదయానందము నొసంగి నీతిని బోధించునవియే యుత్తమకావ్యములు. ఏ విధముగనైనను సుకుమారమతులకు నీతిని బోధించుటయే కావ్యరచనా ప్రయోజనము.

దృశ్యములనియు, శ్రవ్యములనియు, కావ్యములు రెండువిధములు. నటకులచేత రంగస్థలమునందు ప్రదర్శింపఁగినవి దృశ్యములు. వినఁదగినవై ప్రదర్శనానర్హములై వెలయు పురాణములు, ప్రబంధములు, శ్రవ్యకావ్యములు ఇవి పండితుల పాండితీచాతురికి నికషోపలములు. అష్టాదశవర్ణనా సహితములగు కావ్యములు మహాకావ్యకక్ష్యనధిరోహించును.

ఆంధ్రభాషాయోషకు భాషాంతరీకరణమున నిరుపమానసామర్థ్యము గలిగిన కవిత్రయము పెట్టినదే యాదిభిక్ష. ప్రబంధపరమేశ్వరబిరుదంబు ధరించిన ఎఱ్ఱాప్రెగ్గడనంతటి కవు లనేకు లదిమొదలుకొని తమ కవితాకన్యకను ప్రబంధడోలికలం గూడా నయ్యాలలూపుటకై తల చూపసాగిరి. కూచిమంచి తిమ్మకవి మొదలగు కవీంద్రులు మిశ్రప్రబంధములనే గాక యచ్చతెనుఁగు ప్రబంధముల సహితము రచించి యశశ్శాలులైరి. పురాతన కవి తిలకుల యాశీర్వాదమే, వారిసయూరసమే, యధునాతన కవిశేఖరుల కాలంబనము; ఆంధ్రభాషాలలామకు జీవగఱ్ఱ.

మిశ్రబంధరచనకన్న, సచ్చతెనుఁగు పలుకుబడులచే చిత్రితమగు కావ్యరచన, మిక్కిలి కష్టము. కావుననే నంతర్వాణీంద్రులకది సరస్వతీ పీఠము.

## గ్రంథకర్తృప్రశంస.

అచ్చతెలుఁగు ప్రబంధము సిరిశ్రీకృష్ణవిలాసమును రచించిన కవినాథులు శ్రీమాన్ స్నఫ్ళింతిఫుల్ చక్రవర్తుల, రంగాచార్యుల, లక్ష్మీనృసింహాచార్యులవారు, వీరికి, రంగాచార్యులయని, బిరుదనామము. వీరి నివాసము, వరంగల్లు. గోత్రము, హారితసగోత్రము. జనకుఁడు రంగాచార్యులవారు. వీరు వేల్పుగొండ లక్ష్మీనృసింహస్వామి కరుణాకటాక్షలబ్ధవాగ్విభవానుభావులు, ఆంధ్రభాషాప్రవీణులు, చతుర్విధకవితాప్రబంధరచనా నిర్మాణధురీణులు. ఈ విషయమంతయు నాశ్వాసాంతగద్యవలన స్ఫుటమగుచున్నది. వీరీ యచ్చతెనుఁగు ప్రబంధమునే కాక నిరోష్ఠ్యాద్యేతర గ్రంథములనుగూడా కొన్ని రచించిరి. వీరి కవితాశైలి సులభశైలి. పండిత పామరజనమున కానందమొసఁగును. పురాతనకవీశ్వరుల పోకడలు వీరి గ్రంథంబున గన్పించుచున్నవి.

ఈ కుబ్జాకృష్ణవిలాసమునందలి ద్వితీయాశ్వాసము నందలి వర్ణ నాంశములు, తృతీయాశ్వాసము నందలి కూర్మబంధము, మద్దెళబంధము, ఖడ్గబంధము, మొదలగు బంధవిశేషములును, గర్భితమైన చతుర్విధకందములును, కందగర్భ చంపకమాలావృత్తము మున్నగు వృత్తవిశేషములును వీరి పాండితీవైభవమును జాటుచున్నది.

(కుబ్జా వృత్తాంతము)

మధురాపట్టనమును నుగ్రసేనుడు పరిపాలించు చుండెను. ఆతని పెద్దకొమారుడు కంసుడు. అతనికి నూడిగము సేయు దాసి కమల. దీనిభర్త కోమలుడు. ఈ దంపతులు సంతానములేక తపోవనంబున నున్న గర్గమహర్షి చెంతకుఁ జని, యతనివలన తనకొక కుమార్తెగలుగు ననియు, శ్రీకృష్ణుడు వరించుననియు, విని సంతసించి తిరిగి గృహంబునకు జనుదెంచి పిదపఁ గొన్నిదినంబులకుఁ గమలగర్భవతియై సుముహూర్తమున నొకకూతును గనెను. ఆబాలికామణి పేరు కుబ్జా.

(కుబ్జా పూర్వ వృత్తాంతము)

కుబ్జా మువ్వంకలు గల శరీరముకలది, ఈ బాలిక పూర్వజన్మమున, రావణుని చెల్లెలగు శూర్పణఖ. శూర్పణఖ పంచవటియందు శ్రీరామచంద్రుని మోహించి తనను వరింపుమని యనేకవిధంబుల వేడుకొనెను. కాని యప్పుడాతఁ డంగీకరింపలేదు.

శూర్పణఖ పతివ్రతాలలామయగు సీతాదేవిని మ్రింగబోవఁగా లక్ష్మణుఁడు, శూర్పణఖ ముక్కుచెవులు ఖండించెను. అంతశూర్పణఖ విచారపడి, దుఃఖించుచు రావణుని చెంతకుఁ జని, తనవృత్తాంతమును, విన్నవించి, జానకీసౌందర్యముల వర్ణించి. వైదేహియందు, దశముఖుని కనురాగము కల్పించి తాను తపంబున కేగెను.

పుష్కరతీర్థమున శూర్పణఖ పదివేల వత్సరములు, శివునిగూర్చి ఘోరతపంబొనరిచెను. ఈమె తపంబునకు మెచ్చి, శివుఁడు

ప్రత్యక్షమయ్యెను. శూర్పణఖ లోకాభిరాముఁడగు శ్రీరామమూర్తిని నాకు భర్తగా నొసంగుమని వరం బడిగెను.

శివుండా యువతినిజూచి, శూర్పణఖా, ద్వాపరాంతంబున నీ రాముఁడే కృష్ణుఁడుగా నవతరించి నిన్ను చేపట్టగలఁడు. విచారపడకుమని వరంబిచ్చి అంతర్హితుఁడయ్యెను. ఇది కుబ్జాపూర్వవృత్తాంతము.

ఆ కారణముననే శ్రీరాముని యవతారమగు శ్రీకృష్ణుఁడు, మధురాపట్టణమున దేవకీవసుదేవులకు, జన్మించి, యశోదాదేవి ప్రేమసర్వస్వమై, మనోహరములగు లీలలచే, నా బాలగోపాలము నానందాబ్ధిలోమునుఁగ జేసెను.

ఒకనాఁడు కుబ్జ కంసునికి సుగంధద్రవ్యములు తీసుకొని వెళ్లుచుండెను. అప్పుడే రాజమార్గంబున కంసునిచే నాహూయమానుండై శ్రీకృష్ణుఁ డక్రూరసహితుండై గోకులమునుండి విచ్చేయుచుండెను. కుబ్జ తన యపాంగప్రసారములు కృష్ణునిపై బఱపి యాతనిని పరిమళ ద్రవ్యములు గైకొనుమనెను. అతఁడు గ్రహించెను. శ్రీకృష్ణుఁడు, మువ్వంకలుగల కుబ్జయొడలు, చక్కఁగ నొత్తఁదలఁచి, తత్పదంబులమీఁద తన పాదంబులనునిచి హస్తాంగుళి ద్వయమాత్రమా యబల నడుముక్రింద నిడి మీఁదికి లేవనెత్తఁగా కుబ్జ వక్రత్వము వీడి సుందరమూర్తియై నిలిచెను. కుబ్జకు కృష్ణునిపై మోహామది మొదలతిశయించెను. గృహమునకు వచ్చి విరాళిగొని మదనబాధ సహింపజాలక పద్మినియను దూతికను కృష్ణునిచెంతకు బంపించెను. కృష్ణుఁ డేతెంచి, కుబ్జమనోరథము తీర్చెను. ఇది యీ గ్రంథమందలి కథ.

## కవితాశైలి.

ఈ కుబ్జాకృష్ణవిలాసము భగవద్భక్తుఁడగు బమ్మెరపోతరాజుచే రచియింపబడిన భాగవతము నందును, గర్గభాగవతమునందును గలదు. పదిపద్యములతో పై గ్రంథములయందు నుడువఁబడిన, యీ కథ, యీ

ప్రబంధమునందు మూఁడాశ్వాసములలో ముచ్చటగా నభివర్ణింపఁబడినది.

కమలాకోమలులు, గర్గమహర్షి చెంతకు జని, తనపూర్వవృత్తాంతము, నడిగి తెలుసుకొను సందర్భమున, కుబ్జాకృష్ణులపూర్వవృత్తాంతమును, మధురములగు కృష్ణలీలలను వర్ణించుటఁజూడ గ్రంథకర్తృసమయోచితకల్పనా చాతుర్యము వ్యక్తమగుచున్నది.

మఱియు నాయాసందర్భములందు దశావతారములను, సుకుమారపద గుంభనముచే నుడువుటయు, మూలగ్రంథములలో లేని దూతికాకల్పనము గల్పించుటయు, నాలోచింపఁ బై విషయమునే ధృవపఱచుచున్నది.

కవితాశైలి పండితపామరహృదయంగమమై కవియొక్క రచనా నైపుణ్యమును, భావగంభీరతను, బోధించు చున్నది. ప్రాచీనకవితల్లజులత్రోవ ననుసరించి యిందు పురవర్ణనము, స్త్రీవర్ణనము, వనవిహారము, జలక్రీడ, మన్మదోపాలంభనాది వర్ణనములు, సరసులహృదయములు నాకర్షించునట్టుల రచింపఁబడినవి.

ఇందలి రసము, శృంగారము, అది కుబ్జామనోగత రత్యుపాధికమై గోపీలోలుఁడగు శ్రీకృష్ణుని యాలంబనము గలిగి కుబ్జాకటాక్షాద్యను భావసమ్మిళితమై ఔత్సుక్యాది వ్యభిచారి భావపరిపోషితమై వనవిహారాద్యుద్దీపన విభావసముజ్జృంభితమై సమగ్రముగ నిందు సాధించఁబడినది.

ఇట్టి యత్యుత్తమమగు యచ్చతెనుఁగు ప్రబంధమును రచించిన గ్రంథకర్తృ కవితా ప్రాశస్త్యము దెలియుటకై, మచ్చునకొకటి రెండుదాహరణము లొసంగెద.

క. చెందొవలఁ దూఱుకన్నులు
కెందమ్మలఁ గ్రేణిసేయు గేరెడడుగులున్

చందురు బురణించెడు మో
మందముగల చెలినిజూడ । నబ్బురమయ్యెన్.

క. విండ్లాబొమ్మలు తమ్ముల
తూండ్లా కేల్ దోయి మిసిమి । తోరంబగు పూ
చెండ్లా గుబ్బలు మెత్తని
దిండ్లాలలి పిరుదులలరు । తెఱవకు దలపన్.

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల । చెండులాడు
తరినొకటి నొక్కరిత్తపైట । దవిలిజిక్క
మూడుపాలిండ్లు గలిగిన । ముగుదయనుచు
పొలతులందరు నవ్విరి । పొలుపుమెసగ.

క. డాలాపిక్కలు క్రొంగొన
డాలాకెమ్మోవి । తమ్మిడాలాయడుగుల్
డాలానూడ్కులు నునుసవ
రాలాజడతీవి బొంగ । రాలా చన్నుల్.

ఈ విధము రసవంతముగ, నీప్రబంధమును రచియించిరి. మరియు నిందలి (73) పేజీయందలి, గద్య, ప్రాచీనులగు, నచ్చతెనుఁగు ప్రబంధకర్తల, ధోరణి నతిశయించు చున్నదా యను విభ్రాంతిని, పాఠకులకుఁ గల్గించుచు, గమ్మెచ్చున దీసినట్టుల సుకుమారములగు నచ్చతెనుఁగు జానుపలుకుఁ బడులగు బాళించుచు, మనోరంజకమై యొప్పారుచున్నది. ఇట్లనే (100) వ పేజీయందు వచనరచనయు, (109) వ పేజీయందలి దండకము, కుడియెడమగా దీని ననుకరించు చున్నవి.

ఈ కాలమున నచ్చతెనుఁగు ప్రబంధముల రచించువారలే యరిదిగా గన్పట్టెడిని, అందున నీ యాచార్యులవారు మిక్కిలి శ్రమ పడి ఇట్టి యుత్తమగ్రంధమున, నచ్చతెనుఁగున రచించి, యాంధ్రభా

షానభూటీ పాదపద్మముల నొక సువర్ణాభరణము, నొసంగి యమూల్యసేవఁజేసి సందులకాంధ్రమహాజనుల కెల్లరకు శ్లాఘనీయులు. వేల్పుగొండయందు భక్తుల నుద్ధరించుటకై, యవతరించిన లక్ష్మీనృసింహస్వామి, వీరి కాయురారోగ్యైశ్వర్యముల నొసంగి, వీరికి గ్రంథరచనాకౌశలమును, నిత్యాభివృద్ధిగా నొసర్చుగాత.

28–11–32
సంస్కృతవిద్యాశాల
ఓరుగల్లు

ఇట్లు
బుధజనవిధేయుడు
విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి



# పీఠిక

(దాతృ ప్రశంసా)

క. శ్రీకినికాపురమై వి
ప్రాకలితంబై యనేక ♦ హరిహరభవన
స్తోకంబై సంతతశుచి
కాకరమై యోరుగల్లు ♦ పావణించె భువిన్.

గీ. సరగను ప్రతాపరుద్రభూ ♦ జాని భుజబ
లావనత నొందియుండు మ ♦ హాప్రశస్త
సంపదల కాలవాలమై ♦ సంస్మరింప
దిట్టయైయున్న యోరుఁగ ♦ ల్పట్టణంబు.

గీ. వైశ్యకులమణులు కటకంసు ♦ వంశముక్త
లఖిల సద్గుణవేదు ల ♦ త్యంతసుఖులు
గొంటకులగోత్రు లీశ్వర ♦ కోమలారు
ణాంఘ్రిసంస్మరులయ్యె పెం ♦ పండిరచట.

ఉ. ఆ పరమాన్వయంబున మ ♦ హాంబుధిగన్న సుధాంశుపోలికన్
పాపము తాపదైన్యముల ♦ బాపినకల్పక చంద్రగంగలన్
రూపునుమాపి సజ్జనుల ♦ రూఢిపదార్థుల సంతసింపుచుఁ
జూపడె ధర్మమూర్తియయి ♦ జొక్కానుబాలయసెట్టి యొక్కఁడున్.

ఉ. బాలయసెట్టి ధర్మనయ ♦ భావముల న్వెలుగొంది నొక్క క
న్యాలలితాంగి బెండ్లియయి ♦ న్యాయముదప్పక పుత్రరత్నమున్
బాలిమితోడఁ గాంచెలలి ♦ తంబుగ వీరనసెట్టిపేరునన్
గ్రాలిచరించె బేరములఁ ♦ గాదిలిసేసి యశంబుజొప్పడన్.

క. రతికినిసమమై శ్రీ భా
రతిసతుల గుణాదికముల ♦ రంజిలి భువి సం
మ్మతిఁగల్గి యల్లమాంబను
హితమతితో బెండ్లియాడె ♦ హితులు బొగడగ.

సీ. ఆవీరనశ్రేష్ఠి ♦ యాత్మసతిని గూడి
పుణ్యాపగ క్షేత్ర ♦ ములనుఁ దిరిగి
సత్యవాక్ఛ్నియతులఁ ♦ జాలబేరము లాడి
పిన్న పెద్దలలోన ♦ పేరువడసి
దశరథ నృపువలె ♦ తనయుల నల్వుర
గనియెను పెద్ద వెం ♦ కన్న యనఁగ
చిన్నవెంకన్న నా ♦ కొలఁగి మంగయయన
తుదకు శివ్వయ యనఁ ♦ దుల్లఁదూగి

గీ. రతులవిభవ సుభోగభా ♦ గ్యముల నెల్ల
ననుభవింపుచు మిక్కిలి ♦ యార్యసభల
త్యాగరాగవిరాగ సం ♦ యోగభోగ
ములకు తావలమైరి స ♦ ద్ముదముఁ గలుఁగ.

గీ. పెద్ద వెంకయ్యశెట్టి తా ♦ ముద్దియ నొక
రితను పెండ్లాడి గేస్తుబా ♦ డి తొలఁగకను
ధర్మముల ధనము వ్రయపెట్టి ♦ ధరణివెలసె
సంతతులనిత్తె నేలపై ♦ సంతుకొరకు.

వ. అందు చిన్నవెంకయ్యశెట్టి తెరంగు వినుపించెద.

సీ. ఆయతభోగ భా ♦ గ్యములకు బేరుతో
సాటియే యనుచుండ ♦ సాగెనెవఁడు
అ_ట్టిబేరము లంచు ♦ నన్నిదిక్కుల కెల్ల
దనపేర సాగించి ♦ దనరె నెవఁడు
ఆర్జించు ద్రవ్యమం ♦ దర్థభాగము దీసి
యర్థిసంతృ_ప్తికై ♦ యనిపె నెవఁడు
తనయిల్లు దామర ♦ దంపమై ధనముల
జుట్టాలఁదమ్ముల ♦ దనిపె నెవఁడు
గీ. వదలకీశ్వర భ_క్తితో ♦ వరలె నెవఁడు
అట్టి వెంకయ్యసెట్టి గు ♦ ణాఢ్యు డయ్యె
వెలసె యోరఁగలున సిరుల్ ♦ విఱవీఁగ
నొక్కకొమరితతోడ దా ♦ నుల్ల సిల్లె.

క. ఆనాగరికుడు మగసం
తానములే కునికి స_త్త ♦ ధర్మసుతుల పై
పూనిక సేయుచు ♦ తమ్ముని
నూనుని పీరనను గొనియె ♦ నూనుని గాఁగ.

సీ. అగ్రిజునాజ్ఞచే ♦ నల్లారు ముద్దుగా
కార్యక్రమంబు మం ♦ గయ నడుచుచు
సత్యంబుఁ దప్పక ♦ సాగినబేరముల్
జరుపుచు ధర్మవ ♦ ర్జనములేక
నార్జించు ద్రవ్యంబు ♦ లాఱుభాగములుఁగా
పంచి వెచ్చించుచు ♦ పరమవిధిని
పెద్దలఁబొడగన్న ♦ భృత్యుని కై_వడి
వినయవిధేయత ♦ విధిగ నడిపి

గీ. సిద్ధమగుకీర్తి నలుదెస ♦ సీమలందు
వ్యాపకంబునుఁ గావించి ♦ వర్ణనముచి
తాంగనను పెండ్లియాడె ర ♦ త్యాంగనాన
దృశవిలాసిని వెంకమ ♦ స్థిరమతిని.

వ. అట్టి సతీలలామంబు.

ఉ. పీడదుభర్తపై బగిది ♦ విన్న దనంబుగ మాటలాడ మా
టాడదు పెద్దలంగని జో ♦ హారులు సల్పకయున్న వారితో
గూడదు పేదసాదులకు ♦ కోరిక లిచ్చుచునన్న పూర్ణయై
యాడదు మెగ్గుమాటలుప ♦ రాధీనముకై మదితృష్ణలేక తా.

గీ. అట్టిసతియందు ఘంగయ ♦ సెట్టి సకల
సుగుణగణఘను లిరువురి ♦ సుదతిదుగను
గనియె వరమేశు పాదపం ♦ కజ మరంద
బిందుసందోహపాన మి ♦ళిందు డగుచు.

క. నరసింహసెట్టి మదినం
బరముం బెంపొంద కటక ♦ వంశజలధికిన్
పరమవిలక్షణకౌస్తుభ
ము రహింం చెడు వరుస జన్మ ♦ మును జెందెభువిన్.

క. ఆ వెనుక వీరనార్యుఁడు
భావిఫలప్రాప్తి కందె ♦ భవము కళావి
ర్భావముఁగ పెద్దతండ్రికి
వావిరి దత్తకుడునయ్యె ♦ వచ్చెను పిదపన్.

క. ఆయిరువురేక పక్కఁగ
పాయక బేరంబులాడి ♦ బహువిధ ధర్మ
స్థాయికులై కనికరమును
దాయలయెడ నైనఁజూపి ♦ దర్పించి తగన్.

సీ. సిరులలరఁగ శర ♦ సింహాసెట్టియు వీర
సెట్టియుదారభా ♦ సిత మనముల
భూవసతుల నెల్ల ♦ బొందించి వర్తక
శాలల తనపేర ♦ సంస్కరించి
జలదానమున తృప్తి ♦ జరుగు యాతాయాత
జనుల కటంచుపె ♦ త్తనముఁ గదుర
స్థాపించి ధర్మముల్ ♦ జరుపుచు హరికథా
శ్రవణ నైపుణముల ♦ సంస్మరించి
గీ. మరియనేకధనిక శ ♦ ర్మదముఁ గలుగ
ద్రవ్యమార్జన జేసి ♦ విద్యావిశేష
మున గడించి సమగ్ర స ♦ మున్నతాతి
శయయశోభాగ్య భోగ్య వి ♦ స్తారములుఁగ.
మ. వలసున్నిక్కలి కీర్తినిండ కటకం ♦ వంశాబ్ధిరాకాబ్జులై
వలసద్వీరనృసింహ సెట్టులు మమ్ముం ♦ నల్లంతిఘల్ చక్రవ
ర్తుల తంయాలమహాన్వయోద్భవుల దో ♦ డ్తోబిల్చి తోడ్తెచ్చి రా
గిలు కావ్యంబున గల్గుప్రేమనను ల ♦ క్ష్మీనారసింహార్యులన్.
క. మీకవితా కన్యకు
జ్ఞాకృష్ణవిలాస మచ్చు ♦ పడఁగా ధనమున్
జేకొనుడిచ్చెదమని మఱి
వాత్రుచ్చి యశో విభూతి ♦ వర్ధిలఁగ భువిన్.
గీ. సంతసించి నేను ♦ సంతత శుభదాయ
కావ్య మచ్చునకును ♦ కావలయు ధ
నమును గొంచుకొని వి ♦ ధంబుగ ముద్రించ
గలిగితిని మనోజ్ఞ ♦ కమున సతము.

---

## శాస్త్రప్రశంసలో

| పుట. | ప. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧ | ౨ | భవస | భవనా |
| ౬ | ౮ | జుట్టాలదమ్ములు | దమ్ములజుట్టాలు |
| ౫ | ౪ | తన | తను |
| ౫ | ౧౬ | ప్రేమనను | ప్రేమగను |
| ౫ | ౨౦ | వాకుంచ్చి | వాక్రుచ్చి |
| ౫ | ౨౩ | ధంబుగ | ధమముగను |

## ప్రథమాశ్వాసములో

| పు. | ప. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౫ | ౨౩ | ౯ | లచ్చికిసరుదు | లచ్చికినిసరుదు |
| ౧౨ | ౪౭ | ౭ | మొలు | మేలు |
| ౧౩ | ౫౩ | ౧౨ | పరియఁకము | పరియంకము |
| | | | సతముం | సతము |
| ,, | ౫౭ | ౨౬ | కతఁ | కతనీ |
| ౧౫ | ౬౬ | ౨౧-౨౨-౨౪ | కాంద్యు | కాంద్రు |
| ౧౬ | ౬౮ | ౧౪ | నేటితాడి | నేటితేడి |
| ,, | ౭౦ | ౨౦ | మన్నిమా | మన్నియుమా |
| ౧౮ | ౭౭ | ౨ | రించగఁ | ధింపగఁ |

| | | | | |
|---|---|---|---|---|
| ౧౯ | ౮౬ | ౧౬ | కాంచనసౌరు లొప్పు | కాంచనముల నొప్పు |
| ౨౧ | ౮౯ | ౪ | రించగ | రింపగ |
| ౨౨ | ౯౩ | ౮ | కాండ్ర | కాండ్రు |
| ,, | ౯౪ | ౧౬ | విస్రుష్ట | విసృష్ట |
| ,, | | ౨౧ | కాండ్ర | కాండ్రు |
| ౨౩ | ౯౭ | ౧౨ | నఁతమి | నతమి |
| ౨౪ | ౧౦౧ | ౫ | నాలు | యాలు |
| ,, | ౧౦౪ | ౧౪ | మెలిక | ఎలుక |
| ,, | | ౧౯ | కోల్పుల్లే | కోల్పులుల్లే |
| ,, | | ౨౩ | బోడు | జోడు |
| ౨౬ | ౧౧౪ | ౨౨ | మాకును మెఱుంగగు నాయనియొ | మాకునయ యోయని యిస్థిరమొ |
| ౩౦ | ౧౩౨ | ౧౦ | రాయునికి | రాయినికి |
| ౩౧ | ౧౩౬ | ౪ | ఆని | అని |
| ౩౨ | ౧౪౨ | ౭ | మనసీనే | మననసే |
| ౩౪ | ౧౫౩ | ౧౦ | అకూ్రరు | అక్రూరు |
| ౩౯ | ౧౭౮ | ౨౩ | గావె | గావే |
| ౪౦ | ౧౮౨ | ౧౫ | ్రమాకు | ్రమాను |
| ౫౩ | ౨౪౬ | ౪ | వారీ | వార |
| | ౨౪౪ | ౮ | చిత్తరము | బిత్తరము |

## ద్వి తీ యా శ్వా స ము లో

| ౫౮-౬౦-౬౨-౬౪ | | | ప్రథమా | ద్వితీయ |
|---|---|---|---|---|
| ౭౨ | ౭౯ | ౧౭ | వేరుల | నేరుల |
| ౭౬ | ౯౪ | ౨ | కొల్లునుడు | కొల్లునుండు |
| ౮౧ | ౧౨౪ | ౧౩ | మన్నల్ | మిన్నల్ |
| ,, | ౧౨౬ | ౨౪ | తెఱవాయ | తెఱవాయి |
| ,, | ,, | ౨౪ | మెల్లడు | మేల్లడు |
| ౮౨ | ౧౩౧ | ౨౨-౨౩ | నెగ్గ | నెడ్డ |
| ౮౩ | ౧౩౭ | ౨౪ | చెక్క | చెక్కు |
| ౮౪ | ౧౩౮ | ౫ | గవాళింపు | గరాళింపు |
| ,, | ౧౪౨ | ౨౧ | వాకల | క్రైకడు |
| | | ౨౧ | వదలని | కదలని |
| ,, | ౧౪౩ | ౨౨ | మంచు | మించు |

## తృ తీ యా శ్వా స ము లో

| | | | | |
|---|---|---|---|---|
| ౮౭ | ౫ | ౩ | దొడ్డగా | దొడ్డగా |
| ,, | ,, | ౫ | బల్లి | బల్ల |
| ,, | ౬ | ౬ | చందవ | చెందొవ |
| ,, | ౭ | ౧౨ | మేన | మేలా |
| ,, | ౧౧ | ౨౪ | పమ్యోద | పమ్యోర |
| ,, | ,, | ౨౬ | నేమ | నేమి |

| | | | | |
|---|---|---|---|---|
| ౮౯ | ౧౯ | ౬ | దోడ్చి | దోచి |
| ౯౧ | ౩౪ | ౧౯ | యజ్ఞను | ఋజ్ఞను |
| ,, | ౫౭ | ౨౧ | మను | మాను |
| ౯౩ | ౪౧ | ౪ | నిలువ | నిలుప |
| ౯౮ | ౯౨ | ౨౩ | చేయ | చేయి |
| ౧౦౧ | ౧౦౩ | ౩ | పీన | పీడ |
| ,, | ౧౦౪ | ౧౬ | పెడుగ | నెడుగ |
| ౧౦౨ | ౧౦౬ | ౭ | జల్లెడదూఁదిచ | జల్లెడుదూఁదిచె |
| ,, | ,, | ౧౮ | ద్రోంచ్చిన | ద్రోంబ్బిన |
| ,, | ,, | ౨౩ | న త్రం | నంతె |
| ౧౦౫ | ౧౨౬ | ౨౧ | పదుకో | పదుకా |
| ౧౦౮ | ౧౨౮ | ౧౮ | తేలురున్ | తేరులున్ |
| ౧౦౯ | ౧౨౮ | ౨౭ | మెల్నాటి | మేల్నాటి |
| ౧౧౦ | ౧౩౧ | ౧౭ | గాక | గాగ |
| ౧౨౦ | ౧౭౭ | ౨౭ | దూలి | దూలిన |
| ౧౨౪ | ౧౫౨ | ౬ | నలత్రా | వలరా |
| ౧౨౫ | ౧౮౫ | ౯ | బాయ | చాయ |
| ౧౨౯ | ౧౯౪ | ౯ | మెల్నాడు | మేల్నాడు |

(శ్రీమతే రామానుజాయనమః)

(శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః)

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

## (ప్రథమాశ్వాసము)

శ్రీలఁదొలంగి జాలిమెయి ♦ జేజెలుకుయ్యిడ నాలకించి తా
మేలుగఁ గంబమందు పొల ♦ మేకరియక్కునఁ జీరఁబుట్టి పై
డాలము మానివేల్పుల బి ♦ డారు లొసంగి జగమ్ముఁగాచి యు
న్వేలుపుఁ గొండతాపుఁగొని ♦ వెల్గెడు సింగని నేదలంచెదన్. ౧

చం. కసటుఁదొలంగి పోవఁగను ♦ క్రన్నన నెమ్మది నేదలంతుని
రసనెడఁబాసి పక్కిదొర ♦ రాతెదఘు చిగురాకుబోఁడి మే
ల్పసకడకంటి చూడ్కులకు ♦ వాలెములోఁబడి కూర్మితోడ బా
నిసిషులఁబ్రోచు నాకలిమి ♦ నెల్తుకహాజగవస్తతంబుగన్. ౨

ఉ. క్రొంచకబత్తిమీర బలుఁ ♦ గొమ్ముల మేటిమెకంబుఁబ్రోవ ర
మ్మంచును నల్లమేనిదొర ♦ కంజలిఁ జేసిన మానవోంవి మే
లెంచఁగవచ్చి యమ్మొసలి ♦ తేపణగించి వలన్వలంగు పేఁ
యంచులకైదువుఁ దలఁతు ♦ హానుఁజెలంగఁగ బాములారగన్. ౩

గీ. పొలనుమేతరి వెలఁదులఁ ♦ బొట్టనున్న
గ్రుడ్డుల వియంగ వేల్పుల ♦ యెడ్డలుబ్బ
సొంపుమీరంగ రొదసేసి ♦ సోకుగొంగ
దాకయిని వెల్గువలమురీ ♦ దలఁతు సతము. ౪

ఆ. కావలపుఁడాయు తెంపరి ♦ కావలకును
కనలుకారగ్గియైయొప్పి ♦ గట్టుఁదాల్పు
కై విసాళింపఁగల నంద ♦ కమును బత్తి
మీఱ మదిలోనఁ గోరిక ♦ లూరఁదలఁతు. ౫

ఉ. మేలిమినారి నాదుఱుము ♦ మేఁబరువాణము మెప్పుదానిచే
వ్రాలులకోరి వానయు జ ♦ వంబున జేజెలవాన కోయిలల్
గ్రాలఁగ వేల్పుదాయలవ ♦ గన్మడియింపుచు లచ్చిరేనికై
వాలెమునిల్పు శార్ఙ్గమను ♦ బాజుమొగుల్దలకట్టు నెంచెదన్. ౬

ఆ. బాసవాళ్ళనెల్ల ♦ బాములనొందగ
నేయుతుంట రక్క ♦ సీఁకుమూక
లడరనీల్గఁ దిరిగి ♦ నాలచ్చి చెలికాని
కేలనలరు గుదియఁ ♦ గేరిదలఁతు. ౭

ఆ. పడుకటిల్లు గొడుగు ♦ పావాలు పదియూరు
వన్నెపశిడిసాలు ♦ చిన్నిపీట
మొదలు పలువితాల ♦ మదిమది మెలఁగిన
పుడమితాల్పు నెపుడు ♦ కడుదలంతు. ౮

కం. నెమ్మని కటిదేవరకను
బొమ్మంగల సన్నయానముజ్జగముల బె
త్తమ్మును చేకొని బ్రోచుచు
దిమ్మరు నూత్రవతి మగని తిరముగఁ గొలుతున్. ౯

ఉ. గ్రక్కున వేల్పురేని తొలి ♦ కంటుతనమ్మును చూపులాగునన్
తెక్కలులేని మెట్టులమ ♦ తిన్నెను గ్రద్దల గొండ్లితీరుగన్
జక్కపడంగ సేయదగు ♦ సత్తువ రెక్కల గాలివీచు నా
పక్కలసామి యంజలను, బల్మరు వేడెద నిచ్చతీరఁగన్. ౧౦

గీ. పుడమిపుట్టువు సుందర ♦ మునసు మున్ని
కూలుచున్నట్టి ప్రజలకు ♦ మేలు తెలిపి
తెప్పచేలేపి కనుముగి ♦ తిని నోసంగు
కారిమారి కొమారుని ♦ కఱకఁదలతు. ౧౧

చం. ముసిముసి నవ్వు మొమ్మతిలు ♦ మోముసవాణము కొమమబ్బ పెం
పెసగిన కీలుగంటునన ♦ కీడగు మోవి పసిండిని గ్గులర్
బొసగిన మేనునిబ్బరిక ♦ ముగ్గలకన్గవమేల్ గొనాలకున్
బసయయి పోల్చు కాంతిమతి ♦ పట్టిని నెన్నెద బుద్ది తాముసన్. ౧౨

కం. మూటిఁగల కుమ్మఁదెలిసియు
మూటిని విడనాడి యొకఁద ♦ మురయుచువేము
మ్మూటి మనహూపు తోమయి
పాటిలు మణవాళరుసిని ♦ వాలెముగొల్తున్. ౧౩

ఉ. ఉల్లములోన నెంతుమది ♦ నొక్కెడ సేసియు బత్తి నప్పకే
తొల్లిటి బాములంబాడము ♦ దోసములాగడజిమ్మి బైజక
ప్పెల్లదలిర్పసున్నయిడి ♦ యెక్కుడు కోర్కులుఁదీసి ముత్రిరం
పిల్లఁగఁజేసి యగ్గలిక ♦ పిక్కటిలర్గల రంగభట్టుకున్. ౧౪

గీ. బుడుతచెయ్యులగడుకడ ♦ బుచ్చివగ్గె
నెఱపి తిలకింపజేసియు ♦ నీటుకైత
లక్కనము నేరిపినయొజ్జ ♦ లనుదయారి
లక్ష్మణార్యుల మదిలోఁద ♦ లంతునెపుడు. ౧౫

ఉ. తుంటతనంబునం గనటు ♦ తుందుడుకుల్గల కొత్తి వ్వాదంబులన్
కంటువు మజ్జుపుంగలుఁగఁ ♦ గం దిరుగాడుచున్న నన్ను నా
వంటి మెకంబులన్మలిపి ♦ వాలెము మంతనమెల్లఁ జెప్పి మే
లంటగసేయు బత్తిగను ♦ తైదగు బెద్దలనెంతు నెమ్మదిన్. ౧౬

కం. చనువున సీరాముని కత
లను వేలుపుఁ బాసలోన ♦ లలిఁ గుల్కఁగ జే
సిన పుట్టఁబుట్టు గుఱుసిరి
గొనియాడెద గబ్బములకు ♦ కోల్కొనఁగ సిరుల్. ౧౭

కం. పెనుమినుకులఁ గలిగిన చి
క్కనుఁ బోకడఁ జేసి నాలు ♦ గు తెఱఁగుల నే
ర్పున నేరుపఱచు వ్యాసుని
జకవిగుఱోత్తంగఁ దలఁతు ♦ జక్కని మతులన్. ౧౮

కం. గుబ్బుకొను లక్క నంబుల
జబ్బునుపడ సీకమేలు, నతవితములచే
గబ్బములు మనువ గలిగిన
కబ్బపుఁగూర్పరులఁ దలఁతు ♦ కలికి మనువులన్. ౧౯

ఆ. మంచియొఱవి విడచి ♦ మఱి పుంటిచోటున
నీఁగ వ్రాలుతీరు ♦ బాగమైన
యొప్పులెల్ల విడచి ♦ తప్పులచేకొను
కూళగమిని దలఁప ♦ నేల మదిని. ౨౦

వ. ఇట్టు నిచ్చవేలుపుల గొనియాడి కబ్బముఁ జేయు పెద్దలం బత్తిజేసి కూళల నీసడించి వెండియు నావంగడంబు దెలియఁజేయుదు. ౨౧

సీ. హొక్కితుఁడను జడ ♦ దారి కొలంబున
బుట్టి సింగర గుఱుడట్టె నెగడి
తొలుఁదొల్త నల్లంతి ♦ ఘనుచక్రవర్తుల
యను సింటిపేర పె ♦ త్తనముఁ గదుర
మనివేల్పు కొండయం ♦ డను గలమానిసి
సింగనిఁ దాపునఁ ♦ జేరితఁబము

గావించి వగ్గెలుఁ ♦ గలిగి రచ్చలయందు
విద్దెలచే మెప్పు ♦ వెలసి యొప్ప

గీ. నెక్కొరాదారి విచ్చేయు ♦ నేలికయగు
ధంసతేకున కెదుర నె ♦ గ్గసపు నిలచి
తెలుఁగు మొదలైన మైమఱా ♦ సలను కబ్బ
మల్లి కంటూల బిసనంబు ♦ నందుకొనియె. ౨౨

గీ. అట్టి కంయూల బిరుదంది ♦ యతివ మైన
లచ్చికి సకుడుఁ గలిగిన ♦ లక్ష్మియందు
పాల మున్నీరుగన్న జే ♦ జేలబువ్వ
వలె నృసింహార్యుగనియె జె ♦ ల్వంబుగులుక. ౨౩

ఉ. ఆ నరసింహ దేసికుడు ♦ సబ్బపు విద్దెలయందు దిట్టయై
మానిసి సింగనిన్మదిని ♦ మానక రేడుల రచ్చలందు వి
న్నాణెపు దొల్లిపొత్తముల ♦ నమ్మకమున్ వెలయించి పెద్దయై
దానెదగేస్తు పడిని స ♦ తంబుగఁ జేకొనెనెంచి పేర్మితోన్. ౨౪

కం. చినలక్ష్మనాంచారమ
యను చెలువను పెండ్లియాడి, మానసము గులుకన్
గనునాపెయందు నలుగురిఁ
గనియెఁ గొమాళ్ళను కొఅంత ♦ కడఁగనువారిక్ ౨౫

కం. సింగరదేసికు డనఁగను
రంగాచార్యుండనంగ, రాణ నృసింహా
ర్యుంగడు రామాచార్యుఁ డ
నంగను దశరథుని బోల్కి, నల్వుర గనియెన్. ౨౬

సీ. తొలుత సింగరదేసి ♦ కులపేరు పెంపొంది
కబ్బములంపలి ♦ నిబ్బటీకము

దెలుపుచు మక్కువ ♦ గలుఁగఁగ నెనిమిది
యక్కరాలను గల ♦ దంతయెల్ల
ప్రజలకుఁ దెలియంగఁ ♦ బలికి మ్రుత్తికిఁ ద్రోవ
గానుపింపఁగఁజేయు ♦ కలికియతఁడు
రెండవ కొమరుండు ♦ కండిరాయలతోడి
చెలిమిఁ బెద్దగఁజేసి ♦ చెప్పి తెలివి

గీ. మల్లుమన్నెంబులెల్లను ♦ మంచిగలుఁగ
పలుకులవలంతితనమున ♦ వచ్చిపోవు
పెద్దలకు మన్ననలజేసి ♦ పేర్మి యలర
బువ్వతేగంబు గావించి ♦ పొలుపుగాంచె. ౨౩

గీ. నాలుగవ కొడుకు రామరాయ ♦ కొలగమున
వీనె మీటుచు పాటల ♦ వీను లలర
జేసి రాజుల మెప్పించి ♦ చేసి కనుల
చెల్మికానివిమించె వ ♦ సిఁడినిఁదెచ్చి. ౨౪

సీ. మూడవ కొమరుండు ♦ ముత్తి చేడియదారి
దెలిపెడు పెద్దల ♦ తేజుఁగాంచి
బ్రామినుకులలోన ♦ బబలిన మరుగులు
బయలుబెట్టిన యట్టి ♦ బల్లిదుండు
వేల్పుబాసను నాల్గు ♦ విద్దెలయందును
పేరు కెక్కినవేల ♦ వేల్పు పెద్ద
వలనుగా జేదువులు ♦ వలసిన వారికి
నరలేక నేర్పిన ♦ యట్టి ప్రోడ

గీ. రచ్చలను పెంపువడయుచు ♦ రాణ (జెంధి)
రొక్కమునుఁగూర్చి దెసలను ♦ బెక్కుయసము

తేగముల నెన్నిరోఁ జేసి ♦ తిరము గలుగ
నన్నిట వలంతియై తిరి ♦ గెన్నదరుఁగ. 31

కం. దురుసులుఁ బలుకనిదై పె
న్నెరుసులు కలనైనఁ గాన ♦ ని కఱకుఁగలదా
నరుసమయును కన్నెను ము
న్నరుసంబున చెట్టబట్టి ♦ యలరె కలిమిగన్. 32

గీ. కడలికూతురు కతివేల్పు ♦ కై మెలంగు
కరణి క్రొత్తడియగు నాపె ♦ కలసి మెలసి
బత్తి నేయుచునుండ న ♦ బ్బుర మెలర్ప
కనియె నిద్దఱు కొమరుల ♦ కలికియందు. 33

గీ. కన్న కాన్పున పెద్ద సిం ♦ గరగురుండు
నాఁజెలంగి వలంతియై ♦ నాయకుగను
తండ్రి నిలిపిన జెజెకుఁ ♦ దగిన కొలఁది
పక్కమున నెల యేడాది ♦ వఱకుఁ జరుగు
మేలు తిరుణాళ్ళఁ జరుపుచు మేటియయ్యె. 34

ఉ. దక్కినపుం విలాతిగల ♦ తామరపాక్కలి తానకంబులన్
మిక్కిలి గాసి రంగమున ♦ మిన్నగ మార్గళిలోని వేడుకల్
చక్కఁగఁ జూచి రాగవుల ♦ చక్కని కోవెలలోని వందిరిన్
రక్కొనగోదనోము లల ♦ రం దిరునాళ్ళను జర్పెమక్కువన్. 35

ఉ. వచ్చెడు పెద్దలందఱకు ♦ వంటకముంగుడిపింపఁజేసి తా
హెచ్చిన బత్తితోఁగొలచి ♦ యింపుగ సీతమనాబడంతినిన్
చెచ్చెరగేస్తుబాడికిని ♦ చేకొని సింగనపేర నొక్కనిన్
లచ్చి కొమారునట్లఁగని ♦ లక్కిమినాయని బత్తుఁడైమనెన్. 36

సీ. రెండవకొడుకు మేల్ ♦ రేకలు గలిగియు
రంగార్యుఁడనగను ♦ రాణకెక్కి

తనయన్న యట్టులఁ ♦ దామరపాక్కలి
బత్తుడై యన్న ని ♦ బ్బరికమునకు
తగినవాఁడై చాల ♦ దాపరించినకల్మి
పెద్దలకిడుచును ♦ నిద్దమైన
తొలుతటి కోవెల ♦ కలరారఁ దాఁపట
గుడిగట్టి యందులోఁ ♦ గోదనిల్పి

గీ. యూరిలోఁ కల్మిగలవారి ♦ కొడబడికను
సిరులఁ జేకొని తిరుణాళ్ళ ♦ కరయువలయు
పలువితంబుల పనిముట్లు ♦ వార్వమనుమ
డరదమును గరుడిమొదలుఁగఁ ♦ గలుఁగఁజేసె    32

సీ. పితరులు తనిసన ♦ ప్రేముడిగాఁగేస్తు
బాడిని మన్నించి ♦ పాండునివలె
వేడుకరంగమ ♦ వేంకటమ యనెడి
యతివెలు ని ♦ రువు రిల్లాండ్రుగాఁగ
గైకొనఁ పెద్దాపె ♦ కడుపున నైదుగుఁ
రుప్పతిల్లిరి కొడుకు ♦ లొప్పుఁ గలుఁగ
ముద్దులుఁగా విద్దె ♦ లొద్దికఁగానేర్చి
కడువెల్గొగిని వెం ♦ కటనృసింహులు

గీ. డనఁగ సింగరదేసికుం ♦ డన చదురు జ
గముజగన్నాథుడని బిల్వ ♦ గణుతి సీత
రాముడనగను వెండి శ్రీ ♦ రంగఁడనఁగ
పాండవులవలె మించిలో ♦ పాటుబడిరి.    33

సీ. పుటిబి వెంకటమపేరి ♦ మగువ చిన్నమయందు
గలిగిరి కొమరులు కలుములలర

దమ్మిమొలకలువలఁ ♦ దలయెత్తగాసేయు
దొరలయట్టుల వేడ్క ♦ తుల్లఁదూగ
ఘల.గి లక్ష్మీనృ ♦ సింహార్య కృష్ణార్యు
లను పేరుతో జంట ♦ నునుపుగలిగి
పైవారు వీరు నె ♦ ప్వరులైరియాసత
కొమరులలో పెద్ద ♦ కొమరుఁడనుక

గీ. లంతఁదీరఁగ తండ్రి యు ♦ ల్లమునకెలమిఁ
గలుఁగఁదిరుఁగుచు బుడుత చె ♦ య్యోలదోలంగ
నతము పెద్దలదాపున ♦ సంతసంబు
సంపతిల్లఁగ తెల్వివిలె ♦ స్సయని తెలిసి. ౩౯

గీ. కైతఁగలిగినబ్రాఁతి ల ♦ క్కనముఁదెలిసి
కబ్బములుకొన్నిఁజేసి యా ♦ కారునందు
నచ్చతెనుఁగున నొక కత ♦ విచ్చలవిడి
జెప్పఁగా బుద్ధితామరఁ ♦ జేర్చియుంటి. ౪౦

ఉ. నేనొకనాటి వేకువను ♦ నిద్దురలేచి గురుండలంచి చె
లూవనఁగ తానమూడి లలి ♦ యొప్పఁగ వేబదిరెండుచోటులన్
దానగగీఱు, నామము లొ ♦ యారముగానిడి కన్నయన్మొదల్
బూసిక కారికేశవుల ♦ బుట్టువులే మణవాళజోగిమేల్. ౪౧

క౦. ఏకతమున మంతరముల
జోకనుఁగొని మూడిమూడి ♦ జుట్టునకలఁతల్
బోకార్చిబత్తి పెనఁగొన
నాకొమరులు తములు నేను ♦ నాతలిదండ్రుల్. ౪౨

గీ. కలసి గోవిందనగరిలోఁ ♦ గలుఁగుగుడిని
గోదనోచిన వూటల ♦ లోఁ దలంప

మేటిముక్కోటి తిరునాళ్ళ ♦ నాటనుపెరు
మాళ్ళుచవికెకు విచ్చేయు ♦ పూపుతుపను. ౪౩

సీ. కొందరు తిరుమడుల్ ♦ గొడుగులజంటయు
రాణించు వింజామ ♦ రాలువీవ
వీణియపాటల ♦ వివరించిదాసరుల్
కుత్తికలెత్తి క్రొమ్ము ♦ క్కుచునుబాడ
వెనుకను ముందర ♦ విరివిగా జోరమెత్తి
బ్రామిన్కులఅవముల్ ♦ బావలాడ
వేలకొలంది ది ♦ వ్వెలుబట్టి యిరుదట్టు
సాదులుబోగడ విచ్చలవిడిగను

గీ. తళుకువలమురిగుడునువాల్ ♦ దలలవెలుఁగు
దుడ్డుకఱ్ఱలచేబూని ♦ తోలుఁగుఁడని బ
రాబరులుసల్పి సాతాని ♦ రాయులుండ
సిరులుఁజెలువార సామివేం ♦ చేసెనంత. ౪౪

గీ. ఇంతయని చెప్పరాక న ♦ న్నెలుతండ్రి
కనులపండుగాగన ♦ గంగికల్మి
మీరచవికను రతనాల ♦ మేల్మిపీట
పైననిలిపిన తరువాత ♦ బత్తిఁగలిగి ౪౫

గీ. కేలుఁదుగనొక్క చోఁజేచి ♦ కేరినిల్చి
యున్నతఱి నేనుబోవుట ♦ కన్న మొదలు
నున్నపెద్దలు కొందఱు ♦ చిన్నినుడుల
మన్ననలఁజేసి రమ్మొన ♦ మరుపుపడక. ౪౬

వ. నట్లు వారి యానకు సంతసము మమ్మొత్తిల్ల నేల సంటుసట్లోడలిం జేర్చి కేల్ జంటచాచిపడి లేవకున్న పెద్ద లంగటిలో లక్ష్మణా రుసికిన్మూటు రూపుగల మరింగంటి లక్ష్మణదేసికుం డక్కటికము

బూని కేలు పమ్మ్రలం గీలించి లేవనెత్తి తమ దాపున గూరు
చుండ సన్నజేసిన వారి యిచ్చ నొడగూడునట్లు నడచినంత
కొంతవడికి యీ రచ్చను గలవారందఱ రాలించి వినుచుండ నమ్మాళ్ళ
శ్శ్వారు సాదించిన తిరువాయ మొడ్రిలో రాములను బాడిన (కర్పారి
రామబిరాన్నై) యనుపాశురంబుం జదివి దానఁగల మరుఁగు విప్పి
చెప్పుచు నడుమ కన్నయ్య కుబ్జకుంజేసిన మెలుతార్కణ గావిం
చినవక్కణంబు నా పెదతండ్రి యగు సింగరాచార్యుం డాలిం
చుచు కబ్బమందుఁగల యిచ్చలలమికొన. ౪౭

ఉ. హెచ్చినకూర్మి నాదరికి ♦ హెచ్చరికన్మిగులంగవచ్చి తా
జెచ్చెరనుండికీరతికిఁ ♦ జెల్వగుపల్కుల కొంతప్రొద్దుబో
బుచ్చికొమాళ్లు బందుగులు ♦ పొందులు తమ్ములు పెద్దలున్విన
మచ్చికమీర తీయ్యనగు ♦ మాటలవేవిన బల్కెవేడుకన్. ౪౮

ఆ. బావిచెరువుతోట ♦ బావసికివడుగు
కైతకోవెలయును ♦ కాసులెలమి
బాతిపెట్టుటయును ♦ బాడియై యలరారు
నతవితముఁలఁ గలఁగి ♦ సంతులహాహా ౪౯

ఆ. బాడియలరనిల్లు ♦ ప్రాఁతియా సంతులు
నతమునుండుటకును ♦ చాలకూడు
కబ్బమట్లుఁగాక ♦ కారులెన్నో యుండి
వరలఁజేయు నతని ♦ వంగడంబు ౫౦

క. నరిమునుఁజేసిన కలుచము
తరతరముల పితరులెల్ల ♦ దప్పకపునెముం
దొరకొనెదరంచు పెద్దలు
విరివిగ వాకొనరికైత ♦ వివరించినచోన్ ౫౧

వ. కావునసీవు పొచ్చంబులేని మచ్చికతోఁ నచ్చతెనుఁగున కుబ్జాకృష్ణ విలాసంబను పేరట నొక్కకబ్బంబు కొలపు దేవరయగు వేలుపు గొండలచ్చిమి నరసింగని పేర యంకితముఁ జేయుమని మక్కువ చెక్కు లొత్త నక్కటి వేల్పు నొడ్డోలగంబున్నతఱి వక్కాణించిన నరియని కొలువు పెద్దలుబలికిన వల్లెయని యుల్లంబున సంతసంబు వెల్లిగొన నల్ల దేవరకు నీ కబ్బంబు నొప్పింపంబూని. ౧౨

( ష ష్ఠ్యం త ము లు )

క. సిరిచన్నొట్టలఁగల క
స్తూరికప్రపుటసటి చిన్నె ♦ తులకింపగ వ
వ్యారమే పరిరాయనివిరి
పరియఁకముపైన నతనిం ♦ బంజెకుఁదొరకున్. ౧౩

క. నలమేని దొరకుపల్గొ
మ్ములమొకములమేటి గొడనబో ♦ కడచిన వే
ల్పుల రాయనికమునకు
కలువల చెలిదెగడు మొగముఁ ♦ గల దేవరకున్. ౧౪

క. దిట్టరికి పాలకడలిన్
బుట్టువుమగనికిని లచ్చి ♦ పున్నెంబులకున్
నట్టువఁగలిగిన వానికి
దట్టపుగొలచీకువాలు తామరచెలికిన్. ౧౫

క. మగటిమి కంబమునసిలిచి
జగజెట్టన కనకకసిపుఁ ♦ జంపిబుడుతసిన్
ఒగఁజదలు కాపురుసుతె
న్నగఁబ్రోచిన వేల్పుగొండ ♦ నరసింగనికిన్. ౧౬

క. అప్పనముఁజేసినా నే
ర్పుప్పతిలంగుబ్జయనెడు ♦ యుగ్మలికతన్

టొప్పఁగ నచ్చతెనుఁగున
జెప్పెదసింగారమెల్లఁ ♦ జిప్పిలఁగాఁ. ౫౭

క. మున్ను పరీక్షిత్తను దొర
వెన్నుని లలిగోనము లనెడి ♦ వేల్పులఁబున్వన్
బన్నుఁగవీనులఁ గ్రోలుచుఁ
గన్నన శుకుఁడనెడు జోగి ♦ రాయుని కనియెన్. ౫౮

క. కన్నయ్య మంచికతలె
న్నెన్నియొ వినియుంటిగాని ♦ యిఁకఁకుబ్జయునన్
వన్నెఁగల వలఁతిఁగూడిన
పున్నెపుఁ గతవితముఁ దెల్పు ♦ మోయన యనియెన్ ౫౯

(పురవర్ణన)

గీ. ముగితినిచ్చెడు వీఁడులు ♦ మూఁడునాలు
గందుకన్నాకు విషుప్రోలు ♦ చందములను
మించి సిరికొటపట్టయి ♦ మిన్నుఁబ్రాయు
మాలెలుఁజెలంగి మధురనా ♦ ప్రోలు వెలయు. ౬౦

క. ఆప్రోలు కోటకొమ్మలు
చూపరులకుఁ గానబడక ♦ చుక్కలతెఱువుగ్
రాపిడిసేయుచు పైదా
దాపునఁ జదలేటితమ్మిదాటును డాసెన్. ౬౧

సీ. బంగారుగోడల ♦ బొంగారుమేడలు
రంగులెసంగి హూరా ♦ రంగుజూప,
రవళింపుగుచ్చులు ♦ రతనంపురచ్చలు
నిచ్చలోమచ్చిక ♦ హెచ్చుఁగూర్ప
మిన్నుదన్నెడు వెన్ను ♦ వన్నెతిన్నెలచెన్ను
లరుదుగాజూపరు ♦ లలరసేయ

పొలుపగుకోటలు ♦ పొందైనతోటలు
మినుపీను నెల్లత ♦ చ్చనములాడ

గీ. ముత్తియంబులచేరులు ♦ హొత్తుచూపు
లలరఁగస్తురిఁజల్లిన ♦ యంగములును
కలువతామరకెందొఁగల్ ♦ గలుగుచెఱువు
లాటపట్టుగులకిమి కా ♦ వీటియందు. ౬౨

గీ. మచ్చకంటులు మేకల ♦ మచ్చికలర
లలిఁగఁగూర్చున్నతతి మక్కు ♦ వలుఁదలిర్ప
నచ్చరలఁగూడివీణియ ♦ లందుకొక్క
తీరవాయించుచుందురు ♦ గారవమున. ౬౩

చ. సలనగువేల్పురాయరత ♦ నంబులు తిన్నెలమీఁద రాచక
న్నెలు దెలిముత్తియంబులను ♦ నీటుఁగ ముగ్గులుబెట్టి ముగ్గులున్
గలఁ దమనీడజూచి యలు ♦ కందుల కన్నెలటంచుదన్న ము
గ్గులుఁజెడఁదెల్పనవ్వలును ♦ కూఁతులగాంచియు నవ్వుచుందురా. ౬౪

గీ. నెలకలుల దాపుగోడల ♦ నెలవెలుగుల
జేని తేఱులకలులని ♦ డాసఁజూచి
రింగుబిళ్ళలటంచును ♦ బొంగిపిలుల
బోరొనర్తురు తెమ్మని ♦ బుడుతలచట. ౬౫

సీ. పాటులు చెలికాండ్రు ♦ పసలారుమద్దెండ్లు
వాయించుండెడి ♦ వన్నెకాండ్రు
గాణకత్తెలగొండ్లు ♦ కమ్మనఁగలపండ్లు
పొల్పగుజవరాండ్రు ♦ బొడాగుకాండ్రు
యలరులబాదరిండ్లు ♦ కొలఁకుఁ దామరతూండ్లు
మెక్కనంచలపిండ్లు ♦ మేల్మిదిండ్లు

కటికపుపాలిండ్లు ♦ గలిగినవిరిబోండ్లు
సొగసైనవాకిండ్లు ♦ సోర్నగండ్లు

గీ. పోడిమింగలకమ్మని ♦ పూలచెండ్లు
పలుకులలరఁగ కొణిగల ♦ బట్టికాండ్లు
బిడ్డలల్లుండ్రుబంగరు ♦ పెంకుటిండ్లు
కొడుకుకోడండ్లు బబలిన ♦ గునుపుచేండ్లు ౧౬

ఉ. పచ్చలకంబముల్ పసిఁడి ♦ బన్నిన గుంబములొప్పు నంగడుల్
రచ్చలకొత్తడంబులును ♦ రానగరుల్ రతనంపుమాళిగల్
మచ్చులపావటీలువిసు ♦ మానములో హాయుముంజిముత్తెముల్
గ్రుచ్చినచూరులొప్పుకల♦కుల్కొలకుల్ వెలుఁగొందువింతగన్. ౧౭

ఆ. తొల్లికుండబాము ♦ దోసిటిలో నేల
బిడ్డమగఁడుకోల ♦ బీచ్చుతటిని
యెవరుఁబ్రోవకునికి ♦ నేటిపాడిప్వేడు
జేరెనన నగర్త ♦ చెన్నుమీరె. ౧౮

ఉ. పచ్చలకుందనంపుఁపని ♦ పన్నినమేడల నెచ్చెలుల్కురుల్
విచ్చియుచేమ యార్పనట ♦ వేసినసోరన గండ్లవెంబడిన్
వచ్చినకప్రపున్ బాగల ♦ వన్నెలమబ్బు లటంచు నెమ్మికల్
మచ్చికచిందుద్రొక్కుచును♦మాటికిమాటికి విచ్చుపించెముల్. ౧౯

ఉ. వెన్నెలగుత్తికల్లులను ♦ వేల్పులమన్ని మానికంబులె
న్నెన్నియొ దాపికొప్పురము ♦ లెత్తుగవేల్పుల దారినంటగా
బన్నిన దద్దళంబులను ♦ వాలెముజోతులు కప్రపుఁబాగల్
వన్నెగఁ బర్వవేలుపుల ♦ బావలుబూజలు సేతురెప్పుడున్. ౨౦

క. వన్నెఁగల వీటనేనుఁగు
గున్నలలరు నెనిమిదివలఁ ♦ కులనేనుఁగులున్

మన్నుదలఁప్రోయు ననిమది
నెన్నుచు తలలూపితిరిగి ♦ హెచ్చరికలతోన్. ౨౧

తే. గీ. లగ్గులక్కానముల ♦ లలియూపులావును
కలిఁగిజింకరాతు ♦ కత్తళమును
మూలనుండసేయ ♦ జాలినప్రోలిర
వాల్నడల్ జెలంగు ♦ వారువములు. ౨౨

ఆ. వె. పసిఁడికొండబోలి ♦ పగటువేల్పులతేని
బేసికంటిపొందు ♦ బెళుకులొదవు
నరదములనుమించి ♦ యందగించెనుచాల
తేరులరయవీటఁ ♦ దెప్పలుగను. ౨౩

ఉ. ఒక్కటి రెండుపల్లియల ♦ నుబ్బణగించుచు ముజ్జగంబుతో
నెక్కుడు కీరితింగనిన ♦ యేనుఁగు రక్కసితోలుఁ దాల్పుదిన్
లెక్కలుఁబెట్టకేఁ గడిఁది ♦ లేఁకలునవ్వుచు నీసడించి పే
రుక్కుచలంబు మచ్చరము ♦ లొప్పగనుందురు ప్రోలిలోపలన్. ౨౪

ఉ. పేరిమితో మొగంబోకట ♦ విద్దెలనన్నిటి నేర్చిదిట్టలై
వారకనాల్గుమోముల రు ♦ వాణిపు మిన్కులనేర్చియడ్డ పా
టోరగిలెన్ గదాయనుచు ♦ నుడ్డమొగంబులవేల్పు మెచ్చఁగ
య్యార్యరను ద్రిమ్మరిల్లుదురు ♦ నొప్పుగ నెప్పుడు నేలవేలుపుల్. ౨౫

ఉ. మువ్వురువేల్పు లొక్కమొగి ♦ బోరన ముంగలనిల్చియుద్దడిన్
జివ్వనుమార్కొనన్ గడఁగి ♦ నేదలునొందకఁ గెల్వజాలియున్
గ్రొవ్వుఁజెలంగబాపలకు ♦ కోరినకోరికలిచ్చి వీటిలో
మవ్వఁగనుంద్రుతమ్మిచెలి ♦ మామకొలంబుల రాచబెబ్బులున్. ౨౬

ఉ. లెక్కలుఁగల్గియున్న తన ♦ లిబ్బులఁగన్గొని నిక్కుచున్న యా
జక్కులరేనిబింక మెక ♦ సక్కెముచేయుచు వీసుబంతిలో

మక్కునసోములక్కమియు ♦ మన్ననసైరణ మమ్మరించగన్
దక్కరికోమటుల్మిగులఁ ♦ దామరదంపరలయ్యె నిచ్చలున్. ౭౭

ఉ. కౌనున తెల్లదువ్వలువఁ ♦ గట్టక నెప్పుడు వెజ్జునీళ్ళకై
పూనికఁజేసినాఁగలిని ♦ బొల్పుగవెన్నునఁ దాల్చిదున్నకే
నేనొకమేటినంచునది ♦ నిక్కుచునుండెడు నొంటివోఁగురా
నానగుబాటుసేయుదురు ♦ నాలవవారి కొలంబులెచ్చుగన్. ౭౮

సీ. చేదమ్మికొనరుచు ♦ చెలువచేరితియిమ్మ
చేదమ్మియిచ్చిన ♦ చెల్వ దేమి
చనుబంతులిచ్చిన చనెదన్న ♦ చనుబంతు
లెలమిఁగోరుటకంటె ♦ కలువఁగోరు
కలువఁగోరిననీవు ♦ విలువఁ జూపవుగదా
విలువఁదప్పించిన ♦ విరివియేమి
మగువకెమ్మోవిమ్ము ♦ మాటిమాటికినన్న
మోవినిచ్చెదగాని ♦ మొదలనీవు

ఆ. వె. మొగలదెలియుమన్న ♦ మొగలనుదెలియఁగా
వెంతయానటంచు ♦ వింతలొప్ప
కుముమ్మనుద్దులాడు ♦ చిమ్మెయినవ్వీట
పువ్వులమ్మచుండ్రు ♦ పుష్పబోండ్లు. ౭౯

ఉ. చయ్యనమేల్కడాని పని ♦ సాగిన చందురురాల మేడలో
తొయ్యలులెల్ల చన్నులను ♦ దోగిన కప్పురమున్ జవాదులన్
బయ్యెదఁజాఱుతూఱి విరి ♦ బంతుల కమ్మనమోచియొయ్యనన్
నెయ్యముమీరబట్నమున ♦ నీటుగఁద్రిమ్మరుకూనగాడుపుల్. ౮౦

ఉ. నెమ్మికనివ్వటిల్లఁగను ♦ నిద్దపుబంగరు తూగులాలులన్
బమ్మెవతల్గడల్ నునుపు ♦ పాన్పుల సంపెఁగిమల్లి మొల్లలన్

కమ్మదనంబుగాఁబరచి ♦ గాణియలెప్పుడు కోడెకాండ్రతో
యమ్ములగుర్తుచేయుదురు ♦ హాసగుపాటల వీనెమీటుచున్. ౮౧

ఆ. వె. వీటిబోజాఁగులెల్ల ♦ వెలయాండ్రవేనలి
కనులచనులఁగాంచి ♦ కాంచివలచి
వారి బొమ్మసన్న ♦ వలయు వానినిఁదెచ్చి
యిచ్చికలయుచుందు ♦ రిచ్చఁగలుగ ౮౨

సీ. పల్కాలుదాళిమ్మ ♦ పాలిండ్లుగజనిమ్మ
మైతావిపూరెమ్మ ♦ పుప్పితముగ
చిగురులద్దులనిక్కు ♦ జిలుఁగుగచ్చులముక్కు
తమ్మిమోమునఁజిక్కు ♦ దాపగుక్కు
తొడలనంటునగేరు ♦ నుడులుచిల్కలతీరు
యొడలుకాంచనసౌరు ♦ లొప్పుమీర
సారముకోగిలమించు ♦ చూపులేళ్లనువంచు
కురులుచీకటిప్రమాను ♦ గొనబుద్రెంచు

తే. గీ. మోవిమోవికిపోటియై ♦ బోటెకోదమ
తేంట్లుకన్నాపసురపొన్న ♦ తీరుపొక్కి
లలరజవ్వనముంగల ♦ యతివలవలె
యాటఁదోటలునవ్వీట ♦ యలరుచుండు. ౮౩

(రాజవర్ణన)

క. అప్పట్నం బొడికారం
బొప్పంగను నుగ్రసేను ♦ డొనరఁగ నేలున్
నెప్పరిగదచ్చి కడలన్
జిప్పిరిలిన నోగియసంబు ♦ సిరులుజెలంగన్. ౮౪

ఉ. చన్నులగ్రక్క సంబుపరు ♦ సంబుల కోరుల నొక్కవాతెఱన్
కన్నులజంకువే నలిని ♦ కౌడుసుపెన్నడలందు జాగులన్

బన్నముదాయలన్నడులు ♦ బాటిలు పొక్కిలిలేమిఁ గొనునన్
బన్నుగ బంచిపెట్టుచును ♦ పట్నముఁ బ్రోచెను రాయఁ డెప్పుడున్.

సీ. తనలోతుగొనమున ♦ కునుపాలకున్నీరు
కదలక నొకచోట ♦ నొదిగియుండ
తననేలఁ దాల్చుట ♦ కును దచ్చికడలగా
రులఁ దలలలుకనై ♦ మెలఁగుచుండ
తనయీ విజలకంబు ♦ లును బలపేఱునై
మిన్నేటితోడను ♦ మేలమాడ
తనయసం బుట్టిప ♦ డిన వెండికొండపై
పసగల ముక్కంటి ♦ బలుచబరుప

గీ. పైడిచూలాలు తేడులై ♦ ప్పటికి వెంబ
డించి కొలువఁగ పాడియై ♦ మించిగొనము
లలరుచుండఁగ పజలనె ♦ ల్లపుడు బ్రోచి
వెలయునవ్వీటిలో రాచ ♦ వేల్పు తేకు. ౮౬

క. ఆరాయునిచే ♦ దాయులు
పోరునఁ దెగటాఱివేల్పు ♦ బోగము చెలులర్
గారవమునఁ ♦ గూడుచునా
ర్యారాయుని కొసరుచుంద్రు ♦ హరుసమెలర్పన్. ౮౭

ఆ. పిఱికితనము కొలము ♦ కొఱ కొఱయీలేని
గొనము తుఱుగుకల్ల ♦ లునుబిగియును
కఱువు గొడ్డువారు ♦ కలనైన బొంకులు
లేక రాయఁ డేలె ♦ జోకమీర. ౮౮

సీ. పగ్గగొనంబులు పరిఢవిల్లఁగ వేల్పు
టొజ్జజన్నపుదిండ్లు ♦ పజ్జఁ జేరె

చక్కఁదనాలకు ♦ చక్కెరవిల్తుండు
మేయిని విడనాడి ♦ మెలఁగనేల
మఁగటిమి కెడబీఁతు ♦ మమ్మరించగనోడి
సింగపు కదుపులు ♦ చేరె డొనల
మొగము చెల్వమునకు ♦ తొగలరాయుం డోడి
కోడెకాతునుఁ జేరెఁ ♦ గొల్చుచుండె

గీ. ననఁగ నేరుపు సైరణ ♦ లారడంబు
లరుసమును గట్టితన ముక్కు ♦ నక్కటికయు
గలిఁగి మోట ము ఱెగడుచు ♦ కలఁతవిడచి
పబలె వీటనురహిమీఱ ♦ పాడుసాహి ౮౯

సీ. పసఁగల మిన్నేటి ♦ పాలసంద్రంబున
మేలుమేలని చాల ♦ నోలలాడి
మల్లెల మొల్లల మఱి ♦ తెలినుత్తియం
బుల పేరులక్కున ♦ పెలుచదాల్చి
తెలిదీవి వెండి కొం ♦ డల కేగి మఁగరాల
నెలరాల దిన్నెల ♦ నీటుఁజూచి
యలరారు పండువెన్నెల ♦ బాజుదెగడుచు
తెలిదామరల ♦ తెగద్రిమ్మరిల్లి

గీ. నలువచెలువ కలువతేని ♦ వలపుతేని
నూడులకు సొప్పునెద నట్టు ♦ జూపి వెలిఁగి
కీరితని మొను వెలఁదుక ♦ కేరుచుండి
వచ్చి యీరాచచందురు ♦ పజ్జఁ జేరె. ౯౦

ఉ. మొదలిటిదాసరయ్య తొలి ♦ ముట్టె మొకంబును కొండలేము నె
న్నదికడలేనుఁగుల్ చిలువ ♦ మేటి మొదలొక్కని మూడు జెత్రులో

ముదుకలు జేరి బ్రోచిరని ♦ పొందికగా నడిపెట్టి నొక్క చే
నదటుగ నేలదాల్చె కల ♦ యంగనువారలఁ బన్పఁదీరఁగన్ ౯౧

గీ. కడలఁగల రాచమామల ♦ తలలవెలుఁగు
పసిఁడి బొమిడికముల రవ ♦ లెసగుబాజు
లలరజోహారుసేయఁగ ♦ తొలకుహజ్జ
తామరలుగల్గి దొరనుర ♦ తాణి వెలుఁగు. ౯౨

క. తెలివాటు కాండ్రు వీరడి
పిఱికియు గొండీడు తులువ ♦ పేదయు మొగలా
కఱటివజలే కరాయం
డఱి ముఱిగావీడు బ్రోచె ♦ నబ్బురమెనఁగన్. ౯౩

సీ. ఆరావు తనరాణి ♦ తో రాణనుండఁగ
గొడుకులు తొమ్మండు ♦ గురు గలిగిరి
అరయఁగ కంసు ♦ డన్య క్రోధుడనునామ
కుండుకహ్వండు శం ♦ కుండుసుభువు
డనరాష్ట్రిపాలుడు ♦ ననవిసృష్టుండన
తుష్టిమంతుండన ♦ తుల్లఁదూగి
కంసయనంగను ♦ కంసవతియనంగ
రాభూవునననగను ♦ రాష్ట్రిపాలి

గీ. కయ్యనకూఁతులు నలుగురు ♦ గలిగి మిగుల
కలుములలరార సంగడి ♦ కాండ్రు బంధు
గులును బిరుదులు మంతిరి ♦ కొలముఁ గొలుప
వీటబబలెనురా రాచ ♦ వేల్పు తేను ౯౪

గీ. ఆవుడమితేని కెవ్వాడో ♦ య్యారమెసఁగ
కప్రపముఱవాది కస్తురి ♦ గందములను

దెచ్చియిచ్చెడు బానిస ♦ నచ్చకంటి
కమలియనఁబ్రోలఁ జెలువందె ♦ గారవమున. ౯౫

వ. అంత నక్కలికి చొక్కమగు చక్కఁగనంబుల నుక్కుమిగిలి నక్క జంబగు కలిమిచేబుత్తిసి సొక్కుచు నొక్కనాఁడు మంతనంబున హాయిమీర తేకుం దానుపడక గదిం విరిసెజ్జం బసుండి తెలివి యుప్పతిలఁ దనడెందంబున నంతులేని కొఱంతగల కలంత బలవంతంబైనఁ దనమగనిం జూచి సొగసులాడి యిట్లనియె. ౯౬

చ. పితరులునెల్లఁ దన్విసన ♦ ప్రేముడిగొందురు నాల్గుదిక్కులన్
సతిమయసంబుఁ బిక్కటిలు చాల్మనవంగడ ముందుబుట్టువు
ల్జతనపు గొప్పఁగాంచెదము సంతుఁజెలంగిన నంతసంబుఁగా
నఁ తమినిబిడ్డలం గనిన నాఁకొలమంతట మేలుఁగల్గదే. ౯౭

గీ. బిడ్డలేనట్టివారలు ♦ బెట్టుకూడు
గుడువఁదగదని రునులెల్ల ♦ నుడివివారి
వారివక్కణమంతయు ♦ వరుసఁదెలిసి
మెసవుదురు నీరువంటక ♦ మనలుఁ గలుఁగ. ౯౮

ఉ. తమ్ములులేని కేళకుళి ♦ తావులులేని కడిందిపూలు కెం
దమ్మల దాయలేని నిసి ♦ తప్పక దిబ్బములేనియిల్లు ద
య్యమ్ములులేని దద్దళము ♦ హాయిగ రాయఁడులేని రచ్చవా
యమ్మగునట్లుసంతువహా ♦ హా మొలతెంచనిబాముపమ్మగున్. ౯౯

ఆ. సంతులేని వాని ♦ చాలుదలంచిన
బ్రతికినంతవరకుఁ ♦ బబలునుగము
కల్మియున్ననేమి ♦ కొనరెప్పుడు ముత్తి
యిండ్లకెల్ల సొమ్ము ♦ లేకొడుకులు. ౧౦౦

వ. కావున మనపుట్టుగుగిట్టుట పట్టిదియొకాని మంచిగానేరదు నా డెందంబునం గల తలంపొడఁ గూడుటకై యడవికేగి బత్తులమై

పొక్కిలిచూలి ముక్కంటి మొదలగు చక్కటివేల్పుల కెక్కుడు
దేవరయగు రక్కసిగొంగ పాజ్జదమ్ముల మక్కువచే తలంచి
మిక్కిలి మ్రొక్కులు మ్రొక్కికోర్కె లొడఁగూర్పుకొనెదమని
నాలు మగలు తమయిల్లు నూడిగపుచెలియల కంకియఁ జేసి. ౧౦౧

ఆ. పులిసివంగి దువ్వి ♦ బొబ్బమెకంబును
కడఁలియొంటి కాడు ♦ కటిక మెకము
పుట్టకూడుతిండి ♦ పొడలమెకంబుల
బారుఁదిరుఁగు లొంకఁ ♦ జేరనరగి. ౧౦౨

క. కట్టెదురంగనుఁ గొనెపూఁ
జెట్టులుఁ బొదరిండ్లుఁబలుకు ♦ చిలుకలగమియున్
నట్టువపులుఁగులుఁ దిరివెడు
పట్టగునొక తపసితోటఁ ♦ బడఁతియుఁ దానున్ ౧౦౩

సీ. ఎలికఁపిల్లలఁ బిల్లు ♦ తెలమితో నాడించు
వాలుగలను కొంగ ♦ వరుసగాచు
పాలుపొందఁ గువ్వలఁ ♦ బ్రోచు డేగకోలంబు
సింగంబు లేనుఁగుల్ ♦ చెలిమి సేయు
కాటెను బోతులు ♦ కత్తళంబులుఁ గూడు
కోల్పుల్లేడులుఁ ♦ గూడి యాడు
చాఁగంటి మెకములుఁ ♦ జడలమెకంబులు
సయ్యాటలాడుచు ♦ సారెఁదిరుఁగు

గీ. చెట్టునట్టులు మేకలు ♦ చెల్మిసేయు
నిటులమెకములు పులుఁగులు ♦ నీడుఁబోడు
గలిగ్గి యారసపబాసియుఁ ♦ గలసిమెలసి
త్రిమ్మరిల్లును తోటలో ♦ మమ్మరముగ. ౧౦౪

ఆ. ఔరయిచటి వున్నె ♦ మబ్బురం బయ్యెడు
జన్నిగట్టులెపుడు ♦ జన్నములను
నెయ్యి(వేల్చుచుండు ♦ నేటగు(బాబల్కు
సారముపీను లెలర ♦ సొంపు నేసె  ౧౦౪

సీ. పూవుఁగుత్తుల నొప్పు ♦ దీవెలపై జుమ్మ
జుమ్మని మ్రోగెడు ♦ తుమ్మెదలును
కమ్మనిమావులఁ ♦ గలనవలనుఁ దిని
కూకలేయుచునున్న ♦ కోగిలములు
చీఁకటిమ్రానులఁ ♦ జేరి మ్రబ్బులటంచు
నట్టాడుచుండెడు ♦ నమిలిగములు
దెసల నెక్కుడనైన ♦ మిసమిసలాడెడు
కస్తురిపిల్లుల ♦ కమ్మతావి

ఆ. చదలనంటుచున్న ♦ జన్నంపుక్రొంబొగ
తారదారినేగు ♦ వారియుల్ల
మలరఁజేసె నిచట ♦ నవ్వారి వనులైన
చక్కబడునటంచు ♦ చనువుగలిఁగి.  ౧౦౫

ఆ. పోయిపోయి యెదుట ♦ బులితోలుఁబఱచిన
గద్దెపై నిరుసుల ♦ గమిఁగొలువఁగ
గూరుచుండి తెలివి ♦ గుర్తులుఁ దెలుపుచు
వారునమ్మెడ్డలోన ♦ నగ్గలింప.  ౧౦౬

చ. బసుసుము మేనఁబూసి చెలు ♦ వంబగు దామెరపూసలక్కునన్
మిసిమిజెలంగ వేసి యఱ ♦ మించుజడల్ జిగికావిపుట్టముల్
మసలఁగ కక్కుపాలయును ♦ మచ్చికమీరఁగ దాల్చియున్న పె
ద్దనుసియగు గర్గునొక్కరుని ♦ నోములుబండగ జూచిరిమ్ముగన్.

చ. కనుఁగొని యంజదమ్ములకు ♦ గాదిలిమ్రొక్కులు మ్రొక్కుఁగుండెబ
ట్టిని పౌనకాడ నెన్నదురఁ ♦ దిన్నగచేతుల జంటమోడ్చిమె
ల్లనరుసివేఁడ్పు రాయనికి ♦ లక్కన మొప్పెడు సుద్దివాకొనెఁ
దనఁదగు ప్రోలుపొందువిని ♦ తమ్ములదలిర్పఁగ నేయునట్లుగన్. ౧౦౯

ఉ. ఓజడదారి రాయనిను ♦ మూరటశేకయు కక్కసంపురా
లోఁజచెలంగు దాదులకు ♦ నోడక నాజవరాలిఁగూడి రా
దేజగతొల్లి పున్నమను ♦ దెంచుటచేఁ గడగండ్లఁబాసి మే
మీాజతనంపుఁ దోఁటహూరు ♦ వింపెసఁగన్ గనవయ్యనియ్యెడన్.

ఉ. వచ్చినతోడనే నిటకు ♦ వచ్చితినాదు తలంపునీకు వా
క్రుచ్చితినన్న నత్తవసి ♦ కోమటునిం గనివక్క నెమ్మితో
నెచ్చటికేగెదో యిచటి ♦ కేలరుదెంచితివేద ప్రోలు నీ
కిచ్చటఁగోరు గోర్కులున ♦ వేవియొదెల్పుము పేర్మితోనసన్. ౧౧౧

గీ. మధురనాప్రోలి లోపల ♦ మనికినాది
వేడుకను తేఁకిచెప్పుడు ♦ వీఁకమీార
పునుఁగుజవ్వాది గందముఁ ♦ బూయనిచ్చి
వచ్చెదు వలంతికమలినా ♦ వలపురాణి. ౧౧౨

వ. నా పేరు కోమలుండ మే మిరువురము. ౧౧౩

ఉ. దొడ్డతనంబు కల్మిఁగని ♦ తొల్లిటికావల ముప్పతిల్లఁగన్
బిడ్డలులేక బెంగగొని ♦ బెగ్గిలికంబును చిప్పిరిల్లఁగా
నుడ్డమొగంబు వేల్పునెద ♦ నొప్పకము త్తికిఁ ద్రోవలేని కా
ఆడ్డెము వ్రాసె మాకును మె ♦ ఱుంగగునాయని యొక్క వేకువన్.

క. కలువరవడిరోసియు నా
యిటు చెలువలకంకెఁజేసి ♦ యిటురాఁగనుచూ
త్తొలిమేననేయు పున్నం
బులుఁగలుఁగుటవలన మిమ్ము ♦ బాడగంటి మొగిన్. ౧౧౪

క. కారానిపనులు మాచే
గారాబమ్మున నుఁ దీర్పఁ ♦ గానగు నంచున్
గోరిక నడిపితిమి నిరా
బారికతనతమ్మి విచ్చు ♦ పగటిదొరయనన్. ౧౧౬

గీ. అలకించుచు జోగి తా ♦ నబ్బురమున
కోమలుము బల్కు సుద్దుల ♦ కుమ్మఁ దేలిసి
జరుఁగబోయెడుఁ జరిగిన ♦ జరుగుచున్న
వైనములఁ జూచి మాలిమిఁ ♦ బూనిపలికె. ౧౧౭

మ. వినువీడుంగల మేల్ నగంబులను ♦ వే వేపొందగా సంతువున్
గనిన గాని పునెంబుఁ గల్గదని యీఁ ♦ గ్రాల్గంటితో వచ్చి మె
త్తనినైమెత్తోఁ దబమందుఁ గాసిలఁగ నెం ♦ తం జేసి ముప్పోకలా
డొనరింపంగల మేలునొందెదని యో ♦ హో తల్చి తేఁ జూడఁగన్.

ఉ. నీవుదలంచి వచ్చినప ♦ నిన్నెరవేర్పఁగలండు ప్రబ్బమై
దేవర యిల్లుఁ జేరుమనఁ ♦ దెల్లమికై మఱిబల్కె యోరు నీ
తావరమందు నుండిపలు ♦ దారులనోములు నోచియుండఁగా
యేవగనైన సంతుగలి ♦ గించుటలేమిని నీము వెల్లితిన్. ౧౧౯

వ. వెండియు జగమ్మున నల్వయు. ౧౨౦

ఉ. సంతువటంచు మొఱ్ఱలిడి ♦ సారెకు మ్రొక్కఁగరాని వేల్పుమేల్
చెంతకుఁ జేర నేతగని ♦ నేతలు నేసినఁగాని వారికిన్
వంతముఁ గట్టినట్లు మురి ♦ వంబునుఁ జూపెడు సంతుగూర్పకే
వంతల పాలుఁ జేసియుది ♦ వల్దనువారికి నిచ్చు పెక్కుఁగన్. ౧౨౧

సీ. సిరిగలవారినిఁ ♦ జేయు తెగుల్లల్ల
పేదల కాకలి ♦ బెట్టు పెక్కు
సమకూర్చుముదు కని ♦ జవ్వనికిని జాణ
తకుఁ గూర్చు తులువను ♦ తగుగొనములు

గలమేటికిచ్చు ని ♦ చ్చలు నఱ్ఱబ్రతుకును
బ్రల్లదుఁడకు నిచ్చు ♦ బ్రదుకునీడుద
తేఁగముల్ గలవారి ♦ తెఁగకుతేఁపి యొసఁగు
నీలేనివారల ♦ కిచ్చుకలిమి

గీ. గానఁదగనట్టి చెయ్దుల ♦ బూనిసేయు
నలు మొగంబుల వేల్పుకే ♦ కలవరంబొ
ముప్పుదప్పిన మునుసలి ♦ యెప్పుడైన
సేయఁదగినట్టి పనులను ♦ సేయఁగలఁడె. ౧౨౨

వ. అయినను తొల్లింటి బాముసఁ జేసికున్న కసటునన్నాకు కొడుకులు లేనిది కొఱంతగలదియై ముగితిసుగంబు దప్పించినది గావున మీరు వివరించు వివరంబు తేటతెల్లముఁ జేసి బిడ్డలుఁగలుఁగు తెఱఁగు లెట్టులనో యేర్పరించుటకు మీ యట్టి పెద్దలవలనం గదా కొంకులు విడుచుటయునుటయు నసిచందురుఁడు. ౧౨౩

ఉ. జవ్వనిమిన్న కోమలుఁడ ♦ సారెకు సారెకు మీతలంపులో
నెవ్వఁగ నొందనేల తొలి ♦ నిండిన దోసము మూఁడువంకలుఁగా
నివ్వటిలంగ కన్నెకయు ♦ నెప్పరియొక్కతె బుట్టుదానిచే
మవ్వపుము త్రిగ్గులు విసు ♦ మానవువంకలడంగు బిమ్మటన్. ౧౨౪

గీ. వెలయముపోవక లెఱిగిన ♦ వేల్పుతేని
చెలిమిఁగావించు మగలాఁగు ♦ సేతతోన
తనివిసనఁ గొల్చికొడుకు నొ ♦ క్కనిని గనును
గానయిలుఁగూర్చి పొమ్మ ♦ క్కనగు తలఁపు. ౧౨౫

క. నావినిరుసి మీసరఘున
కావేలఁదుక బలికెముగితి ♦ నందించెడిదా
వావిరి మువ్వంకలు దిగి
బోవుటెటుల చక్కఁజేయు ♦ ప్రోఁడయెవండో. ౧౨౬

సీ. అదిగాక కలుసాన ♦ నొదవిన దానిని
　　　మఱపోక లాఁజేల ♦ ముట్టుకొనుసు
ముట్టుకున్నను లాఁతి ♦ ముద్దుగుమ్మలఁ జాల
　　　నెనరు నించుటకేల ♦ నెగడుచుండు
నగడైపోయతఁ డేల ♦ నేనున్న తావున
　　　కరుడెంచు నయ్యెత ♦ గ్గనక బొమ్మ
గ్రుడ్డులోపలి పజ ♦ కూరిమిఁ గాచఁగ
　　　దలచియుండెను గాదె ♦ తల్లిదండ్రి
గీ. వరెను బత్తులఁ బ్రోవఁగ ♦ దలఁచిపుడమి
కరుగుదెంచునో లేకయీ ♦ యున్నమిన్న
నొక్కరితెఁ బ్రోవ నేతెంచు ♦ నోకలంకు
వీడిపోదె ప్రాహాసంబు ♦ విఱ్ఱవీఁగ. ౧౨౮
మ. అదిగాకింతకు వెన్కబాముననయహో ♦ యూకూసచే కొన్నమై
కొదుకుల్ నాకువటారినుద్దులను వా ♦ క్రువ్వంగమీ కుందగున్
ముదితన్ మేమెటుగాంచ గల్గుదుమొ బెం ♦ పుల్మీర నీముద్దబె
ల్లిదమా దోసములేఁగుఁ బెట్లగునొ తా ♦ ల్మిన్ దెల్పి మన్నింపవే.
క. సిరిపెనిమిటికే తలలో
దురసగు నేతలనుఁ జేసి ♦ త్రుళ్ళైనొ నాకున్
దరవడిగఁ దెలియబలుకుము
పరిపరిడెందంబు చెదరె ♦ బమ్మెరఁ గలిఁగెన్. ౧౨౯
వ. అనినవిని రుసిమానికంబు నెట్టన రెట్టించిన సంతసంబుట్టిపడ నా దిట్టరులఁ జూచి మీరు తలంకకుడు మీతలంపోడఁ గూడు దానిని తేటతెల్లమిఁ జేసెదనని యిట్లనియె. ౧౩౦
గీ. మునుపు బవాలుకాశ్వుడను రాచ ♦ పులికి వేల్పు
తపసిరాయఁడుఁ దెలిపిన ♦ దానిమీకు

తేటతెల్లమి జేయుదు ♦ తిరిగితొల్లి
బామునను సేయుదురుసుల ♦ వడఁతికతను ౧౩౧

సీ. మునుపుసీత మగండు ♦ మొనసితండ్రి యాన
కలికితో తమ్మునితో ♦ కాన కేగి
పంచవటిని నాకు ♦ పాకనుగట్టించి
సుగముగా నుండఁగ ♦ శూర్పనఖయ
నెడు చెలియే తెంచి ♦ నేలనాయని చక్క
దనమునుఁ జూచి త ♦ త్తరముగదుర
వలరాయునికి మారు ♦ వలరాయుఁడగు వీని
పొందులేని పలంతి ♦ పుటుగుపుటుకె

గీ. యనుచు మదినెంచి సంతోస ♦ మగ్గలింప
తాను వలపుమిటారియై ♦ దగ్గరించి
కలికిచూపుల జూచుచు ♦ కలిమిడిగను
బలికెమొత్తని మాటల ♦ బన్నరించి ౧౩౨

ఉ. రాచకొమార నాకువల ♦ రాయని కన్నను మిన్నవౌటచే
దోచెను పెండ్లియాడికల ♦ తోయము తీరు మెలంగవచ్చితిన్
బ్రోచెదవోమఱిం పెనఁల ♦ ద్రోచెదవో వివరింపుమన్న నా
రాచకొమారుఁ డొద్దికను ♦ రావణు చెల్లెలితోడ నిట్లనున్ ౧౩౩

గీ. మెలఁత నాతోడబుట్టువు ♦ మెలఁతలేక
యున్నవాఁడదె వానితో ♦ నున్న నీకు
జేజెపట్టునఁ గలమంచి ♦ జెందవచ్చు
ననినరక్కసి విని లక్ష్మ ♦ ణుని కదిసియు. ౧౩౪

ఉ. ఓమగనీదు చక్కదన ♦ మువ్విళులూరఁగ నేయవచ్చితిన్
నామదికోర్కె దీర్పుమని ♦ నాతుకబల్కిన నవ్విలక్ష్మణుం

డోమడఁతీన నుంగొనిన ♦ నూడిగమెవ్వాడు సేయువాడనా
తోమటికున్న నూడిగెవ్వ ♦ తొత్తువటంచను బల్కరేపజల్. ౧౩౫

క. అనివిని యిద్దరిచెంగటి
కిని యిటునటుతిర్గితిర్గి ♦ కేఁగుచునుండన్
గనియొక్కటాలు బతిమును
గొనుకశరధుకొడుకు వలపుఁ ♦ గొనకయెనుండన్ ౧౩౬

ఉ. చక్కదనాల కుప్పయగు ♦ చానను౹మింగిన నన్నుగొందరం
చొక్కమొయిం దలంచిమురి ♦ యుయ్యెలయై జెలువొందమింగబో
నక్కటయంచు ముక్కుచెవు ♦ లంటగగోయుమటంచు నన్నబీ
తెక్కఁగ జేయనట్టులొన ♦ రించెను తమ్ముఁడుకాఁకు దొల్గగన్.

గీ. ఇలుముకు చెవులుదరిగిన ♦ యింతియోగి
యన్నయగు రావణునితోటి ♦ యున్నదున్న
యట్లు వివరించి సీతహొ ♦ యలనుదెల్పి
తెచ్చుకొనన్ట్లుజేసి య ♦ త్తెఱవపొగిలి ౧౩౮

గీ. అంతటనుబోక కాౡుని ♦ కంకియపడి
పుష్కరంబను తీర్థముఁ ♦ బోయియచట
మగవజయు నల్పుతబము నె ♦ మ్మదిగసేయ
బూనివిరికందువను చాల ♦ పూన్కఁజేసి. ౧౩౯

గీ. సరవిపదివేల యేండ్లే ♦ సరములేక
మిత్తిగొంగను మదిలోన ♦ హత్తుకొనుచు
సేయగా వెండికొండను ♦ సీమగలుఁగు
గిబ్బతత్తడి రౌతుతా ♦ కేరినిలిచె. ౧౪౦

ఆ. నిలచిదుగ్గి మగడు ♦ నెలఁతయేమిటికోరు
కొనెదవేమొ తెలియఁ ♦ గనుపరుచుము

టంచు బలుకలేము ♦ తవరఁగా నిట్లను
వేఁడ్పువేల్పుకొండ ♦ విడిచిచేజె. ౧౪౧

క. నాకోరిక వినుపించెద
చౌకనొనర్పంగవలదు ♦ చక్కని వాడా
రాకొమరుఁడు రామునికై
జేకొనమదికోర్కె బొడమె ♦ చేయుమన సీనెన్. ౧౪౨

క. ఒకటూలు బతముబట్టిన
పకపకనగు మొగపురాచ ♦ పట్టినిచే ప
ట్టకటూసాగునె యూర్కో
మ్ముకరుంగునె వానియెడద ♦ ముందగుకోర్కెల్. ౧౪౩

గీ. ద్వాపరములోన తుదకును ♦ తాతతండ్రి
చెలఁగి దేవకికినిఁ బుట్టి ♦ చెనఁటిపజను
ద్రుంపగావచ్చి నిన్ను చే ♦ నింపుగలుఁగు
కలవమును గొనియేలును ♦ గారవమున. ౧౪౪

గీ. అనుచు కోరినకోర్కిని ♦ యగ్గికంటి
యొసఁగియేగిన పిమ్మట ♦ నొక్కపొద్దు
తోడనున్నంత వరకును ♦ తొలగనియెద
రాగవునిపైన మెలఁగఁగ ♦ రానయుండి. ౧౪౫

వ. బాము బామునకు పూవిల్తునకు పూవిల్తుఁడగు రాగవుండు దప్ప మరియొకరి నాకఅదకుతేఁడుఁ గాడని తలంచుచు నుసురులను వదిలె అది వెండియు ద్వాపరము తుదకు మధురయనెడు పట్నంబున కంసునికి బానిసెతనంబుసేయు కమలకోమలులకు జగము తల్లియగు చాలుపేరిటి సన్నవలఁతిని చెరబట్టించిన దోసంబీ బామునగల వేసంబునకు మువ్వంకలు గలిగించి కుబ్జ నాపేరట జెలువారుచుంటునని. ౧౪౬

క. ఈరవళితొల్లి తతిలోన్
సీరామునికిం దోసంగు ♦ జేసిన దోసం
బారంగ శూర్పణఖయును
బారుగముప్వంకలలకు ♦ బాయును బొందుక. ౧౪౮

ఉ. ఆతటిలోన రామునిక ♦ యూరెరియొసన్ద్విసనె బ్రతెల్లయున్
దాతదలంచి చూచితిగ ♦ వంకలుగుజ్జుతనంబు నిచ్చియా
నాతుక కావలంబుఁ జన ♦ సల్లని దేవర కాచునంచు మేల్
ప్రాతలుప్రాసె సీతలఁపు ♦ వాలెము సాగునుబోందు వేమకన్.

గీ. మంచివారలఁ బ్రోవఁగ ♦ మఱియు చెడ్డ
వారిఁద్రుంపఁగ బామంది ♦ పాడినిలుప
నేలఁబుట్టును కఱివేల్పు ♦ నీకుశూర్ప
ణఖయును నెలంతకలుఁగు వి ♦ న్నాణెముగను. ౧౪౯

సీ. అనితొల్లికతఁ దెల్పి ♦ యదుగుడంచవి బల్క
మదికోర్కెఁ దెల్పు నె ♦ మ్మదిగనాకు
బుట్టెడుకొమరిత ♦ మువ్వంకలలరిన
కఱివేల్పుతోడఁ జ ♦ క్కనగుననుచు
నుడిగితిరయ్యయో ♦ పుడమిని దేవర
యెచ్చటఁ బుట్టునిం ♦ కెచట బెరుగు
నెవ్వరెవ్వరిఁ బ్రోచు ♦ నెదిరించుమార్తుర
నెవ్వరిఁ దెగఁజూచు ♦ నవ్వడిగను

గీ. ఎట్టిపున్నెపు వానికిఁ ♦ బుట్టఁగలఁడో
వారివక్కణమంతయు ♦ వ్వారిఁగాఁగ
తెలియఁబల్కుఁడు నాయెడఁ ♦ దిరముఁగలుఁగ
కనికరంబార కన్నయ్య ♦ కతనువినెద. ౧౫౦

వ. అని వేడుకొనిన నక్కమలకోమలులకు తపసిరతనం బిట్లనియె.

క. మీవీఁడు జేనికన్నగు
దేవకుఁడను రాజుకూఁతు ♦ దేవకియనఁగా
రావెలఁదుక యందు నకటి
దేవరయుంబుట్టి జగము ♦ తీరికసేయున్. ౧౫౨

వ. అదెట్లంటిరేని నేలవడంతి గోరిన తీరుగ, నేలకేతెంచి వలుగాకి పజల నెల్ల తునిమి, నెవరిచే యెవరు బాగుపడవలయునో, చావు నొందవలయునో, అట్టివివరంబులు, నెరవేర్చి వ్రేపల్లెలో నందుని యింటనుండి కాఁగల చెయ్వుల జరుపుచున్నంత కంసుని పంపున యక్రూరుండనువాఁడు మధురయను ప్రోలికి నా రాచదారిఁ గన్నయ్యయే తెంచి నీకుఁ బుట్టుగు నొందు మూఁడుపంకలు గలుగుగుదకు.

ఉ. చక్కదనంబు లిచ్చునని ♦ జగ్గెనువక్కణమంతఁ దెల్పినన్
జొక్కుచు కోమలాంగి తన ♦ జోటికతోరుసి చందమామకున్
మొక్కికరంబుగా సెలువుఁ ♦ బొందినుగంబుగఁ బ్రోలుచేరి యుక్
మిక్కుటమైన బుత్తులను ♦ మేలుగనుండిరి నోలలాడుచున్. ౧౫౪

గీ. అనుచు వివరింప ♦ విన్వచ్చు ననుగుకొడుకు
కొమరుడిట్లని బల్కె మ ♦ కుకన చెలంగ
వెన్నునిసుమాళమగు కత ♦ విరివిసేయఁ
దగుదువనరుసి తెల్పె సం ♦ తసముతోడ. ౧౫౫

సీ. ముందుసోకులపాలు ♦ నంగిపుట్టిన రాచ
తరటులనెల్లనుఁ ♦ దాల్పలేక
పుడమిబమ్మనుఁ జేరి ♦ యదుగులపై వ్రాలి
తనపాటు దెల్ప ద ♦ త్తరముతోడ
వేలుపు ముక్కంటి ♦ వేలుపు పెద్దయు
పుడమి చేడియఁగూడి ♦ పోయిపోయి

పాలకడలిఁ జేగి ♦ ప్రాజదువులతోడి
ముప్పొకలాడెద ♦ మురువఁ బొగడి

ఆ. తాము వచ్చు సుద్ది ♦ తప్పకఁ జెప్పిన
వినితలంపుఁ దీర ♦ వినఁగఁ జలికె
వేల్పులార మీరు ♦ వేంచేయుఁడిక్కల
కేను దీర్పఁగలుఁగు ♦ నీకలంత. ౧౫౬

ఆ. మీరలేగి నేల ♦ మీరగు పాళులఁ
బుట్టియుండు కొలాన ♦ మురుపుఁ జూపు
డటులనందమార ♦ నచ్చరలందరుఁ
బూజ సేయ నాకుఁ ♦ బుట్టుఁ డెలమి. ౧౫౭

ఆ. రసులు నెల్లఁ బోయి ♦ రూపసి మెలఁతలై
గొల్లవారలయ్యె ♦ తెల్లనైన
యాలగుంపులయ్యె ♦ మేలిమి జముననకు
పొంతతిగియలయ్యెఁ ♦ బుట్టుఁడనుచు. ౧౫౮

క. పనిచియు తానుంగలువల
యనుఁగుకొలమునందుఁ బుట్టు ♦ వగుపను దేవుం
డను దొరకుఁబుట్టి తోడ్తో
డనె కంసుండనెడు సోకు ♦ డాకల కెదలోఁ. ౧౫౯

ఆ. తండ్రి బీతు నొంది ♦ తత్తరమున బావఁ
జేతఁబట్టుకొనుచు ♦ చెలఁగి త్రోవ
నడువ తలుపులకును ♦ నాటినబీగముల్
తొలఁగిపోవఁ బోయి ♦ కలఁత దొలఁగి ౧౬౦

చ. జమునను దాటినందుని ప ♦ సందగు మేడనుఁ జేరిలోగిట
న్గొమరితతోఁ బరుండినయ ♦ నుంగుయ శోదవలంతి సెజ్జపై

కొమరునిఁ జేర్చి బిడ్డఁగొని ♦ కుమ్మరిగతొట్టెటి బందెకొనకున్
గిమకిమవచ్చి చేరనది ♦ కేవుగ కేవురటంచు నేడ్చెనర్. ౧౬౧

గీ. అత్తరిని కంసుఁడా నాదు ♦ నాలకించి
కత్తిచేఁబూని దేవకి ♦ కైనిఁ జెలఁగు
బిడ్డపుడమిసిఁ బడవేయఁ ♦ బెరసిపైకి
లేచి తనమేనుబెంచియు ♦ లెక్కఁగొనక. ౧౬౨

ఉ. ఓరిగ రానినిన్ దునుము ♦ టొప్పునె దెంతకురంగ టంగలం
దూరకనిన్నుఁ జంపఁగలఁ ♦ డొక్కఁడు కారదెదగ్గరించెనో
రాజగంబు కొల్లలన ♦ హాకడుఁబెట్టిన యన్న మొక్కలై
జేరెనటంచు తాను పెను ♦ సిగ్గులమాటలుఁ దెల్పిపోయిసన్. ౧౬౩

క. తనమంతిరి కొలమును గనుఁ
గొని తలపోతలను చాల్చ ♦ కుందుచుఁ జేయన్
వినిపూతనయను రక్కసి
దనగుండెనుఁ గల్గుతీరుఁ ♦ దార్కొణ జేసెన్. ౧౬౪

మ. వినుమోజేడ తలంకు జెందులకు వే ♦ వేగన్ గొమా రెల్గొమా
ళ్లను వెల్గొందెడు నూరుమెట్టి ములు ని ♦ ల్లుంజూచి సంతున్ననా
చిని పాపన్ వెసఁజంపి వచ్చెదను మీ ♦ సేనుంబుచేకూరు దా
నిని నీమిత్తులు పెగ్గడల్ సరియనర్ ♦ నెగ్గింతు నీ గుట్టులన్. ౧౬౫

గీ. అనుచు చెప్పినమాటల ♦ నాలకించి
తనకు రంగటమెలఁగెడు ♦ నసుఁగుకాండ్ర
నాల్గుదెసలకు బంపి వి ♦ న్నాణెమైన
గుండెతో కంసుఁడుండెను ♦ కూళలంత. ౧౬౬

సీ. పురిటింటి బిడ్డల ♦ బొలియజేయు మటంచు
కంసుండు బంచిన ♦ కదలివేడ్క

నూరూర నింటింటి ♦ సొరఁగదిరిగి వే
సారకమఱియొక ♦ తూరిదిరిగి
వినుచున్నులఁ జొ(?)ప్ప ♦ పసఁగలమేనితో
పసిఁబాపలను జు(?) ♦ (?)లసిచ్చి
వలపించి పజలను ♦ వాలెఱుఁగో(?) గొని
పూతనయను సో(?) ♦ పుప్పుఁబోడి

ఆ. నందు(?) న్న గొల్ల ♦ మందకుపచ్చెసి
పాప యున్న జాడ ♦ పట్టిచూచి
రాయశోదయింట ♦ రానతో కన్నయ్య
కేవు కేవు(?)నెను ♦ కేకవినుచు. ౧౬౭

ఉ. లోపలి కే పదెంబియొన ♦ లోపలమెచ్చుచుఁ దొల్లినున్నయా
పాపనిడగ్గరించి పసి ♦ పాపడ నాచవిగల్గుపాలన
య్యావరువ్రం జెలంగయల ♦ రారును వేల్పులకోన యింకపాల్
చేపిదగ్గైకొనం దగును ♦ చేకుసు జేజెలయుండ బాగెముల్. ౧౬౮

క. చిటిపొటిమాటల తనపొది
గిటికిని లే నె త్తివాయి ♦ కివి చన్నియ్యన్
గుటుకు గుటుక్కని పాలొక
గుటుకను మైవిరచినీల్గి ♦ కుఱ్ఱఁడుఁ గుడువన్. ౧౬౯

చ. గుటుకు గుటుక్కటంచు నొక ♦ గ్రుక్కెడుపాలనుఁ బీల్చినంతలో
తటతట గుండియున్ వడక ♦ దప్పినగుట్టులుగల్గు మేనితో
జిటజిటలాడుచుండ గుడి ♦ చెన్ మఱిరెండవ గ్రుక్కయప్పుడ
క్కటకటమై పరాకుగొనఁ ♦ గాపసిబాపడునీడ బోవకే. ౧౭౦

సీ. మూడవగుటుకకు ♦ మురువగు మైనిడి
యిక చాలుచాలని ♦ యెత్తుఁబడిన

విడువక మఱియును విసపుఁబాల్ గ్రుక్కను
పీల్చిన నసిజెడి ♦ పెంచియొడలి
రక్కసిరూపును ♦ రక్కొనపై బడి
యాడఁగ గొల్లెత ♦ లరసియరసి
మాయురేయిది యెంత ♦ మాయలాడి యటంచు
మనముద్దులానిని ♦ మనుచుఁజేజె

గీ. యనుచు వేలమి బొట్టిడి ♦ యాయశోద
కడకు గొంపోయిదించిరి ♦ కప్పురపడి
గొల్లలందఱు గొడ్డంట ♦ గొట్టిదాని
గాలిచిరి పోయెనది మంచి ♦ కలఁకునకును. ౧౭౧

సీ. మున్నెల్లకుఱ్ఱఁడై ♦ మురయుచు దనకాల
బండిసోకును గూల్చె ♦ గుండెలదర
నీరాఱునెలలలో ♦ నెగసికసువుసుడి
నల్లఁద్రావుడుఁ బట్టి ♦ డుల్లసేసె
పిన్నపాయమునాడె ♦ మన్నుదింటివె యనఁ
దల్లికి నోటిలోఁ ♦ దాతగ్రుడ్డు
లెన్నియో చూపించె ♦ నింతలోఁ దపసియా
గర్గునిబిలిపించి ♦ కన్నతండ్రి

గీ. రమణతోఁ బేరుఁబెట్టించెఁ ♦ రామకృష్ణు
లనఁగ పెంపొంది యన్నతో ♦ నాడిపాడి
వారుసమిగు రొత్తదాముస ♦ ల్లారుముద్దు
తల్లిదండ్రుల కిచ్చుచు ♦ నుల్లసిలిరి. ౧౭౨

శా. ఆలోవేఁతల యిండ్లలోఁ దిరిగిచు ♦ ట్లద్దింపుగా నిడ్డమే
ల్పాలుం బెర్గులువెన్న చట్లపయి కే ♦ ల్చ్వేవన్ దరిలేక తా

పూటపెరయింటి కేగి యిం ♦ పుగను పెనఁగు
ముచ్చిలించియు దాగెను ♦ బుసుతఁజూచి ౧౭౯

ఆ. కేలకోలను దూలించి ♦ జాలిమాలి
దుడుకుపనులను జేసితే ♦ దొంగయనుచు
కోలజళిపింప బరుగెత్తి ♦ కుఱ్ఱముదరిఁ
జేరి కంబాలనడుమను ♦ దాయుచుండ. ౧౮౦

శా. అమ్మా యెన్నడు నిట్టిచెయ్వులను నే ♦ యంబోనునటఁ గొట్టకే
నెమ్మింజూడుము వ్రేతలాడు నుడుగుల్ ♦ నీగుండె కుందామరన్
నమ్మంబోకు మటంచు వేడుకొని వి ♦ న్నాణెంపు గందమ్ములన్
ముమ్మారంబుగ నీరుఁజాఱలలి ♦ మోముంద్రిప్పి తా నేడ్చినన్.

చ. విడువకయయ్యశోదచెలి ♦ వెన్నునితో సరిదిర్గిమోమునన్
బుడిబుడిచేఁ జెమర్పనికఁ ♦ బోయనికట్టనుఁ జూపిపట్టఁగా
నెడయయి తల్లికిన్నరము ♦ లెచ్చెనటంచును చేతజిక్కినన్
బుడతసి మ్రాకుతోటికిని ♦ బొట్టకుఁద్రాటనుఁ గట్టెఁగట్టినన్. ౧౮౧

గీ. పోరుతపసితిట్టు ♦ పాండుజక్కుల త్రేని
కొడుకులిరువు రేగి ♦ పుడమిజమున
పొంతజోడు మద్దు ♦ లెంతయునై యున్న
వానికడకుఁ బోయి ♦ వ్రాలెచ్చటోల. ౧౮౨

గీ. రక్కసుఁడు చాలబెట్టను ♦ రాపిడికిని
విరివివేర్లుఁవల్లె విడనాడి ♦ బృందయనెడు
కానలోఁ జేరిగొల్లలు ♦ కఁడకఁగక్క
గొలువఁగానుండె సుగములఁ గొనివతారి ౧౮౩

గీ. లేఁగవేరిటి సోకును ♦ లేటుఁజేసి
కొంగరక్కసుఁజీలిచి ♦ చెంగుమీర

యఘుఁడ నేఁడు సోఁకుసప్పమై ♦ యలరనోటఁ
జొచ్చిమెఁజొచ్చి గొల్లల ♦ జోకమని చె. ౧౮౫

సీ. జమున పొంతను గొల్ల ♦ చట్టముత్రోఁ సద్దిఁ
గుడుచుచు దూడల ♦ గుంపుఁగొకఁట
మేయుచునుండఁగ ♦ మిందోఁపరుల పెద్ద
యేతెంచి లేఁగల ♦ నెత్తుకొనియు
నురుఁగుబడన్ సేయ ♦ మాసకకన్నయ్య
దవ్వుగాలేఁగలుఁ దాటెననుచు
మూరలీ సద్దులఁ ♦ మ్రింగుడటంచని
వెతుఁకఁగా నేగెనా ♦ వెనుకనెమటి

గీ. నలువవిచ్చేసి గొల్లపి ♦ ల్లలనుఁ గవిని
దాచి తనచోటికరిఁగిన ♦ తలనుకట్టి
నకుఁడు వేంచేసి బమ్మము ♦ చ్చరముఁ దెలిసి
వేల్పులఁపిల్లలలేఁగల ♦ వేసమూని. ౧౮౬

క. మేపెడువాఁడుం దానయి
మేపుచు మలుపుచునుఁ దానె ♦ మేయుచు నిండ్లన్
బాపలు తల్లులు లేఁగలు
జేపెడు నావులనుఁ గలసి ♦ చెలమిగనుండెన్. ౧౮౭

గీ. ఇటుల నాన త్తిఁగలుఁగగ ♦ నింటియందు
కానయుండలి చెరలాఁడఁ ♦ గా మఱిపెఱ
వారిఁగానావులకు గొల్ల ♦ వారలకును
కానుపించకఁ దానెనై ♦ గడిపెనేడు. ౧౮౮

ఆ. ఒంటిప్రోఁగొక్క నాఁడుమే ♦ లంటివచ్చి
గొల్లబుడుతల దూఁడల ♦ గుంపులఁగని

తొలిటిపూవులు విడనాడి ♦ తుల్లఁదూఁగి
కలిమి చెలిజేఁపుపూవులఁ ♦ గలిఁగె నేమొ. ౧౮౯

గీ. అనుచు కతివేల్పునడుచుచు ♦ న్నంతనలువ
వచ్చి కేళివుల ప్రేవసిఁ ♦ బాపలెదుర
మెలఁగఁగాగని తనుఁదాచు ♦ మలగవికినిఁ
బోయి నిదురించు క్రేవులఁ ♦ బుడుతలఁగని. ౧౯౦

ఆ. బమ్మగుడ్డులోని ♦ పజలనెల్లను సేయు
నట్టినన్నె దిర్చి ♦ యడరులేకఁ
బుట్టఁజేసె గొల్లఁ ♦ బుడుతలఁదూఁడల
నేమిఁజెప్పవలయు ♦ నితనిపగ్గె. ౧౯౧

మ. అని లోలోనఁదలంచుచున్నఁ దలలో ♦ నయ్యారె కన్నయ్యరూ
పునుఁదప్పన్ జగమేమియుం గనక బ్రమ ♦ బ్బున్నప్పుఁడోడ్తోడ మే
ల్కని నేనెంతటిమోసపోతి జగము ♦ ల్గావింప మన్నింపగ్రొ
న్నన పోలింపఁగ మన్నియుండితని నే ♦ నాగెల్చి యోడించుటల్.

వ. అని తలంచి యుంచనుడిగ్గి కేల్ తమ్ముల నెదుటఁగీలించి జొహారు లొనర్చి తనవలన జరిగిననేరంబు సైపుమని యగ్గించి వెండియు.

క. ముమ్మారుహాజఁ దమ్ముల
నెమ్మది తలబూమిడికంబు ♦ నెలరతనపుడాల్
గ్రమ్మఁగ బ్రమొక్కడి పొగడుచు
నిమ్ములక్కై యతనియాన ♦ నేగెఁగొని మనన్. ౧౯౨

వ. వెండియు.

సీ. ఆవుపేరిటి నల్లఁ ♦ దాగ్రివుఁడుఁ దెగటార్చి
తనయన్నతోఁ బ్రబలం ♦ బునిఁ దునుమఁగ
నేసికాళియుఁ బట్టి ♦ గాసిలఁగావించి
మడుగులో నీటినిమంచిఁచేసి

ఆలమందలు గొల్ల ◆ లార్చుచు కేలొడ్డప్ప
కార్చిచ్చుమ్రింగి చొ ◆ క్కముగఁ గాచి
చెలఁగి వ్రేతలమేలు ◆ చీరెల ప్రుచ్చిలి
తబసుల యిల్లాండ్రు ◆ తగిఁ బగిలి

గీ. తెచ్చియిచ్చిన మేల్బువ్వఁ ◆ దినికడంగు
పెద్దగొల్లలు సురతాణి ◆ పేరజరుపు
జన్నమును మాన్చిగుట్టక ◆ చ్చంపుబత్తి
జేసివిందులొనర్చినఁ ◆ జేజతేఁడు. ౧౯౬.

చ. కినుకన్ దొమ్మిదిప్రమ్ముబ్బులం గలిపి వ ◆ గ్గన్ బంపవిచ్చేసియు
ల్లనప్రేపల్లెను బృందకానఁగురియన్ ◆ లావైన రాల్జల్లులన్
గనిగొల్లల్ మొఱవెట్టి కావుమనఁగా ◆ గట్టొక్క కేల్గోటితో
డనె లేనెత్తివటారి వ్రేఁతలను వ్రే ◆ లఁ గల్మి యూలమందలన్. ౧౯౭

వ. జాకుండ తన నెఱజాణతనంబున వినువీఁడు నాయం డేడురాతిరి బవళ్ళు వానఁగురిపించిన సుంతైనఁదూలకున్నంత నెవ్వరపడి జల్లుజల్లుననే తెంచి నేలనుఁ బ్రోవఁగాఁ బుట్టినము పోఁకలాఁడుఁ గాని మానిసిఁగాఁడని తెలిసి నజ్జదమ్ముల కెరఁగి యగ్గించి యుక్కన్నయ్య యానతింగొనిఁ దనచెంకికిన్ జనియె నంత నొక్కనాఁడు తామరపాక్కలికై వస్తుండు పూట నొరునాడునందుండు జమున జలకంబునందానంబాడుచుండ నందరపుతేని బంటొకండతనింబట్టుకొనిఁబోవఁ కతివేల్పది విని వాని గొంటికికింజని తగిన మన్ననలం జెంది పితరునిందెచ్చె కావున నాప్రోడగాఁతుగొనియాడ నెవరితరం బిదియుంగాక. ౧౯౮

కం. తత్తరములేక వెన్నుఁడు
కత్తెరపున్నమఁ జెలంగఁ ◆ గల నెలలోనన్

సత్తువఁగనొక్కరేయిన్
బుత్తిఁగగుంపనెడు నన్నుఁ ♦ బొందినకానన్. ౧౯౯

మ. మరుగంజోఁగుల గుండెదామరలు వే ♦ మాఱుసలారింప సం
దరపుంగూఁతురుచన్నుబంతులను ని ♦ ద్దాపుల్కలుంబుట్టఁగ
క్కరమారాల్గరఁగన్ దలిర్పఁ జిగి మొ ♦ క్కల్దివెలుంజెట్లు తే
సరికెందామరక్రేఁగనుందుగలతె ♦ స్సంజూడ్కి సొంపారఁగన్. ౨౦౦

ఉ. పిల్లనఁగ్రోవి బాడినను ♦ వ్రేచెలు లెల్లరు విన్కి తోడనే
చల్లనజందమూము వెసఁ ♦ జల్లఁగ రాతిరివచ్చి వల్పుఁజొ
త్తిల్లఁగవ్రుటువౌ చనులఁ ♦ దద్దినకస్తురిగందముం జవా
దెల్లను మేనునంట చెలు ♦ వెక్కఁగఁ గౌఁగిలియిచ్చి వెండియున్. ౨౦౧

కం. వ్రేఁతయు వెన్నుఁడు మఱియున్
వ్రేఁతయు వెన్నుండు నిట్లు ♦ వేలకు వేలున్
జేతులు బుజముల నిడుకొని
బ్రాఁతిగవ్రుటువగ నిలిచి బాడిఁదిరుఁగుచున్. ౨౦౨

తే. గీ. జోటికలు వెన్నుఁడీ తెగ ♦ నాటలాడు
వాదనుఁజూడఁగ వ్వదునెని ♦ మిదియుగణుతి
బమ్మపూటలు నొక్కరే ♦ బవలుఁజేసి
వాళిఁజెలువంద వ్రేఁతల ♦ ట్లాటలాడ. ౨౦౩

తే. గీ. ఇట్టుల వ్రేతలతోఁగూడి ♦ యించువిల్తు
దురములోఁగల మేరకుఁ ♦ దొంగలించి
పలువితంబులవారితో ♦ జలకములను
వేడ్కనాటాడిబంచెన ♦ వ్వేలఁదులమఱి. ౨౦౪

కం. అబ్బురమగు చెయ్వేలత
బ్బిబ్బిమియు లేకఁజేసి ♦ ప్రేముడిమందన్

గుబ్బకొనుతల్లిఁ దండ్రుల
నిబ్బరమునుఁ జూచి మెదిలె ♦ నిండినవేడ్కన్. ౨౦౫

వ. అంత సంతుకొరకు తోఁటం జేసిన కమలకోమలులు రుసినాసనొంది సుకంబుగా సల్లుం జేరి. ౨౦౬

క. ఉన్నంత కొన్నినాళ్లకు
గ్రొన్ననవిలుకాని రంతు ♦ కొనసాగఁగ మే
లెన్నఁగ చెరలాడెడుఁ దల
గ్రన్ననెల మసలెను బయ ♦ కారమెలర్పన్. ౨౦౭

గీ. కొలఁది నడుకలవసఁ దీఱె ♦ కోర్కెలూరె
చిట్టుములు మీఱె, చెక్కుల ♦ చెల్వుఁజాఱె
పెలుచమన్గోరె, మోము వె ♦ ల్వెలుకవాఱె
పొట్టయలరారె చవులనుఁ ♦ బొందగేరె. ౨౦౮

గీ. అసలుఁ బుట్టుగుపైవ్రాలు ♦ మిసిమితేటు
లనఁగ నలుపెక్కె చనుమొన ♦ లలరెఁ జెలికి
దపసి కన్పొపవెలుఁగులఁ ♦ దనరుకలువ
యనఁగ పొక్కిలివిప్పెన ♦ య్యతివకంత. ౨౦౯

క. చీటికి మాటికి మన్నన్
బోటికిఁ దినబుద్దివొడమె ♦ పొటుకున యలఁతల్
వాటిలె నిట్టూర్పొదగెను
నేటుఁగ ముమ్మూన్నెలలు ♦ నిండినయంతన్. ౨౧౦

ఆ. మంచితోయమునను ♦ మగువకు గన్నెక
బుట్టెనమ్మ లక్క ♦ లుట్టపడఁగ
సంతసంబుతోడ ♦ సలిపిరి పురుటాలి
కి పదిపూటలమఁగఁ ♦ గేరుచపుడు. ౨౧౧

ఆ. చానలెల్ల జెలికి ♦ సంపెఁగినూనియ
దలకునంటి కమ్మ ♦ నలుగుఁబెట్టి
నీటుఁ గుల్కు తావి ♦ నీటిని మజ్జన
మూడఁజేసిరపుడు ♦ పోఁడిమిఁగాని. ౨౧౨

సీ. పుట్టిన కూఁతునుఁ ♦ బోడఁజూచి తండ్రి
ముత్తికిఁ ద్రోవ యీ ♦ మొగుడ యనుచు
మువ్వొంకలునుఁ గాక ♦ మోము కోమలికము
ముజ్జగంబుల చాల మురువుఁజూపు
నని బెద్ద సంతోస ♦ మును సందరంబులో
నోలలాడుచు నెదఁ ♦ జాలిమాలి
తతిమీరకుండఁగఁ ♦ దగిన చెయ్వులఁ దీర్చి
బిడ్డచే గలిఁగిన ♦ బిరుదమనుచు

గీ. సాగి నందునివల్లెలో ♦ చదలుకాఁపు
లలరబెరుఁగుచు నున్నట్టి ♦ కలిమి నెలఁత
మగఁడు కన్నయ్య యెంతటి ♦ మానిసనుచు
తెలిసి తెలియని యట్లుండె ♦ తెలివిఁ గలిఁగి. ౨౧౩

ఆ. అప్పు డప్పడాలు ♦ నరిశెలు మండెంగ
లట్లు బుబ్బడమ్ములు ♦ పిట్లు మణుఁగు
బూలు దోసెలిడ్డె ♦ నాలు నేవెలుగార
లప్పచులునుఁ బుణుఁగు ♦ లొప్పఁజేసి. ౨౧౪

ఆ. తెలుపుఁగలిగి మిగుల ♦ మిలమిలరాలెడు
జోన మఱుఁటికాయె ♦ పొందుపరచి
పులుసు పప్పుకూర ♦ పులుగము త్వేత్త్వర
వంట లమరఁజేసి వలఁతుఁలపుడు. ౨౧౫

తే. గీ. గొప్పమొకముఁ బులుఁగుల ♦ గొత్తగముల
దెచ్చి వేర్వేఱఁ జరఁగియు ♦ వచ్చి యొఱపి
లోన మేలేరికఱుకొట్ల ♦ లొసఁగదలిపఁ
బూని సేసిరి నిప్పాక ♦ లూని చెలఁగి. ౨౧౬

ఆ. వె. క్రొత్తకుండలందు ♦ కోసినపాలును
బ్రాలుఁగునంజుడులను ♦ పొందుపరచి
సారఘుంపినూనెఁ ♦ గట్టాఱికట్టాఱి
పలువితంబులొప్పఁ ♦ బదిలఁబఱచి. ౨౧౭

కం. కొంతన్గమ్మనతియ్యన
కొంతన్పుల్లనఁగఁ జేసి ♦ కోర్కెలొదవఁగా
యింతులు మెల్పొంతులు సే
మంతులఁ గొప్పులను ముడిచి ♦ మదిమదిమీఱన్. ౨౧౮

కం. సింగారమలర నెలఁతలు
పొంగలిపాలోగిరంబు ♦ పులిహోగిరమున్
ముంగలనిడి దేవరలకు
పొఁగిజలకమెదుటఁ వార్చి ♦ పొదలినబగితిన్. ౨౧౯

కం. ఒకచేకల్లుంగొని వే
రొకచే పాలపఁబుఁ దీసి ♦ యొకఁడరఁగొనఁగా
నుకము చెలఁగనిచ్చుచు పే
ర్మికలుట్టిపడంగ ♦ ద్రావి మేలని యొదలోన్. ౨౨౦

తే. గీ. ఒంటి తెరవర్లబోనము ♦ మించియున్న
వెత్తినీళ్ళను చేకొని ♦ వేఁడుకలను
మీఱఁ ద్రావుచు నువ్విళు ♦ లూర పెరను
లారఁగించిరి లాహిరి ♦ నగ్గలింప. ౨౨౧

కం. కలుసందుగలుఁగు గోనసులు
నలరారఁగ యూసియూని ♦ కలుబందుగులున్
పలుమారు రొదలుఁబెట్టఁగ
తలయూపనులెల్లమాని ♦ తరలిరి మేటుల్. ౧౨౨

సీ. ఒకఁడు పాటలఁబాడి ♦ కోకిలికి వేసంబు
బూని చిందులుఁద్రొక్కి ♦ బుద్దిమాని
ఒక్కఁడొక్కసిబట్టి ♦ చక్కఁగఁగాఁగిట
నొత్తికల్ద్రావించి ♦ నొదుగ సేయు
యొకసక్కెమాడుచు ♦ నొకడు చియ్యనునోట
బెట్టిలేదని కేలు ♦ వేయుచుండు
తనచాయదనయట్లఁ ♦ దనరతిగ్గాడిన
బట్టఁబోయితురీనఁ ♦ బడునొకండు

తే. గీ. యిటులకైపును వేవట ♦ యొసకరింప
మేనులూఁగఁగనడుకల ♦ మిసిమిఁదోలఁగ
నెఱులు రేగగ కన్నుల ♦ యొఱుపులెదుఁగ
పవ్వళించిరి బడలికఁ ♦ బడి తలంపు. ౧౨౩

కం. ఇంతులరతనములందఱి
బంతులుసాగించి బువ్వ ♦ పళ్ళెరములలో
సంతుగబెట్టిన మొసవిరి
పంతుగమిత్తులునుతోడి ♦ బందుగులుపజల్. ౧౨౪

ఆ. వె. వెలఁది కూఁతుకొఱకు విందులుఁగావించి
మిసిమిగొలుసులలరు పసిఁడితొట్లె
గట్టిబిడ్డనుంచి ♦ బెట్టుఁగచెలులంత
జోలబాడిరచట ♦ మేలుమీఱ. ౧౨౫

ఆ. పెద్దలంతఁగూడి ♦ పేరిమిఁదళుకొత్త
వెలుచకుబ్జయనెఁడు ♦ పేరుఁబెట్టి
కేటఁబెరుగుపాప ♦ బూటఁబెంచిరివగి
యారుగణుతియేఁడు ♦ లరుగునంత. ౨౨౬

తే. గీ. అప్పుడప్పుడు తలిదండ్రు ♦ లబ్బురంపు
సేతలనుసేయు కన్నయ్య ♦ చెన్నుతెన్ని
మాకొమార్తెకు మగఁడైన ♦ మంచిదనుచు
బలుకమునిమునిసి నగవులు ♦ వడఁతినవ్వ. ౨౨౭

తే. గీ. పుట్టినదిగోలెదురుసుల ♦ పోవడములు
లేకకన్నియలనుఁగూడి ♦ వీఁకనాట
పాటలనుఁబ్రొద్దుబుచ్చుచు ♦ పలుకువలన
కన్నయగొనాలనెల్ల చ ♦ క్కవనిఁదెల్పు. ౨౨౮

ఉ. మంఠయశోదయింటికిని ♦ మాటికిమాటికివచ్చి పోవువా
రండఱు నల్లమేనిదొర ♦ యబ్బురమాకతలెల్లఁ జెప్పఁగా
విందుగవీనులన్వినుచు ♦ వేడుకఁజెందుచు మైగగుర్పఁగా
నందయశోదలేమిటి నొ♦నర్చిరొ బాగెముగల్గుచెయ్యలన్. ౨౨౮

వ. ఇట్లు మధుర యను పట్నంబున డెందంబుగొందలబడనీక నంద
కొమారుని యడుగుదమ్ములకై జోహారుసలుపుచు కన్నులఁ
గన్నడు బాగెంబునకై యెదిరి నూచుచు కంసునిరాణికి పూట
పూటకు తావిగలగందంబులిచ్చి వచ్చుచుండెనట. ౨౩౦

క. దుగినుని బసనుండియు ము
జ్జగముల మేలరయఁదలఁచి ♦ సయ్యనవచ్చెన్
జగడాల తిండిరుసిరా
జొగిసేలకు నొక్కనాడు ♦ హజాయలుఁ జెలంగన్. ౨౩౧

సీ. మునుమున్నె మథురకుఁ ♦ జను దెంచి కంసుని
చే గారమునుఁ జెంది ♦ చెప్పినప్పు
డేకతంబుననుండి ♦ యీవుల మొదవుకు
సరిఁదూఁగు మొదవుల ♦ చాలుఁ బ్రేలు
తలఁపనందుడుయశో ♦ దయు రోహిణియు వసు
దేవుఁడు దేవకి ♦ తెగయదువులు
మొదలుఁ గాఁగలవారు ♦ చదలు కాపులుఁగాని
మానుసులునుఁగారు ♦ మఱియుఁదొల్లి

గీ. కాలనేమివిసీవును ♦ గానపుడమి
గావబుట్టిన కఱివేల్పు ♦ గాని కట్టి
చెలియు చెడుపులుఁజేసిన ♦ చెనఁటిపజను
జంపివాడిని నిలుపు నీ ♦ జగమునందు ౨౩౨

సీ. మిన్నుబల్కిన పల్కు ♦ లెన్నిబీతునుఁజెంది
పసికూనలనుఁ ♦ జంపపట్నములకు
పల్లెలకీవంపు ♦ బలగము నందఱి
బ్రేపల్లెలోనున్న ♦ వెన్నుఁడకట
తెంపరిమైఁ జంపె ♦ దెలియదు నీకది
యనిరుసి చందురు ♦ డరిగెనంత
దేవకి కడుపునఁ ♦ జేవఁగా బుట్టిన
కొడుకుల నార్వురఁ ♦ గూల్చి పిదప

గీ. చెలియలినిఁ బావఁదలిఁదండ్రిఁ ♦ జెరనుబెట్టి
కువలయా పీడమను నేనుఁ ♦ గును నెదురను
ముష్టికునరిష్టు చాణూరు ♦ మొదలుఁగలుఁగు
బిరుదులనురచ్చలోనిల్పి ♦ బెట్టుచెడక. ౨౩౩

గీ. ఎల్లగొల్లలు విచ్చేయ ♦ విల్లుసన్న
జన్నమును సేయు నెపమును ♦ బన్ని చెలులు
మంతురులుఁ దానుతలపోసి ♦ మందనున్న
వారిరప్పింపఁ దలఁచె న ♦ క్రూరుచేత. ౨౩౪

సీ. కంసుని సూనచే ♦ కదలి యక్రూరుండు
వ్రేపల్లె కేగిన ♦ వేడ్క నొంది
నలమేని దొరయు మ ♦ న్ననసేయ హరుసించి
తనరాకఁ దెలుప నం ♦ దయునుఁ గూడి
విలుసన్న జన్నము ♦ వేఁడుకఁ జూడఁగ
పన్నుఁగ నన్నతో ♦ బయనమైన
తరువాతి నందుండు ♦ తగుపెద్దగొల్లలు
మిసిమి పాల్పెరుగులు ♦ మేల్దినుసులు

గీ. మొదలుగాఁగల కాన్కల ♦ మొసరి రాఁగ
మధుర కేతెంచు తెరువులో ♦ మరునిగన్న
తండ్రిచూపించె తొల్లింటి ♦ తనదురూపు
బగితితోఁ జూచె నక్రూరు ♦ డొగిజమునను. ౨౩౫

ఉ. ఎప్పటియట్ల కన్పడిన ♦ యేలిక వెన్నునిఁ జూచి తేరుపై
జప్పున నెక్కి వేనడచి సౌరగు ♦ పట్నముఁ జేరి తోఁటలో
జప్పరమందు నిల్చియు బ ♦ జారున రానొకచాకివల్వలుఁ
గొప్పరమందు నుండఁ దల ♦ గొట్టి వళావళిఁ దాల్చి రొప్పుగన్.

వ. అంత బోయిపోయి. ౨౩౬

ఆ. సోగులిచ్చువాని ♦ చోటుకు వేంచేసి
వాఁడొసంగు సరులు ♦ వరుసఁ దాల్చి
కలుములిచ్చువాని ♦ కలకును విడనాడి
త్రోవవచ్చుచుండ ♦ తొట్రుపడుచు. ౨౩౭

క. ఆతీరుఁ దారినడుచుచు
పూతకునై గంధముఁగొని ♦ మువ్వంకలచే
నాతుకకుబ్జయు రాఁగనై
నేతలకాకోరఁ గొనఁగ ♦ చిక్కనివేడ్కన్. ౨౩౯

గీ. కట్టియనుమడ నేనేమి ♦ కతలుఁజెప్పె
దచటికి కెదురేగె మువ్వంక ♦ లలరుచున్న
గుజ్జునా చెలిగంధముఁ ♦ గొనియొడయుని
కియ్యఁగా బోవగనివెన్నుఁ ♦ డిట్టులనియె. ౨౪౦

ఉ. ఎవ్వరిదానవీవు కుల ♦ మెయ్యది నీకిడు పేరదేమో కో
యివ్వలవున్న గంధముల ♦ నెవ్వరికియ్యఁగ నేగుదానవో
నవ్వడిదెల్పుమన్న హాకు ♦ సంబున దెల్పెను రాచలైన మా
మవ్వపునుద్దికిం బదులు ♦ మాటనుఁ జెప్పఁగ నెంతదాననో. ౨౪౧

సీ. వినఁ దెల్పెదమీర ♦ లాలించు డోగికంను
వరువుడ నల్లని ♦ వన్నెఁజేజె
హొజ్జదమ్ములఁ బుట్టు ♦ వందినవారి మేల్
కొలము మాయదిపేరు ♦ గుజ్జయంద్రు
పన్నీరుజవ్వాది ♦ బల్తావికస్తురి
గంధముగల కోర ♦ లందిమెపుడు
దేవేరికిచ్చెద ♦ దేవరకొనియెడు
తలఁపున్న చేపట్టఁ ♦ దగుదురహహ

గీ. తొల్లి మేనునఁ నేజేయు ♦ దురుసుపనుల
దోసమెల్లను నిన్నుఁ గం ♦ డోయిచేత
జూచినంతనె సమసె ని ♦ చ్చోటకలవ
మొదలఁబూయుము సకులతో ♦ హెచ్చరికను. ౧౪౨

గీ. అనిబలికి గందమిచ్చి యా ♦ య్యారి కేలు
మొగిచినిలిచిన చినదాని ♦ తెగయు మొగము
నిగనిగలు వారికలపము ♦ నెమ్మి కాంచ్రు
జూడ చేకొని బలికెమె ♦ చ్చుగను చెలికి. ౨౮౩

ఉ. పాయమునందు నీకుగల ♦ వంకర ముప్పిరివోవునట్లుగా
మేయినిఁ జక్కఁ జేయుదని ♦ మేల్కడకంటి వటారిచూపులన్
బాయకఁజూచి చిత్తరము ♦ బాహిరమై వెలుఁగొందఁ బోరపై
బూయుచు నన్నయుం జెలులు ♦ బూయగనిచ్చెను బూసిరందఱున్

గీ. పూసియక్కటికముఁ బూని ♦ పొలఁతి చెక్కు
క్రిందనొకకేలు హజ్జల ♦ యందు హజ్జ
లుంచి మొగఁదీయ చద ♦ లున మించు నల్ల
మ్రబ్బులో మెఱుపుదీఁగకు ♦ మాద్రిబోలి ౨౮౫

తే. గీ. రంగుమీఱంగ పొంగారి ♦ రాణమెసఁగఁ
మంతనంబున వలపోత ♦ కొంతఁ జేసి
చెలియొయ్యారపుఁ జూపుల ♦ చెలిమి వెన్న
దొంగపైఁ గలపసిఁడి చె ♦ ఱఁగుబట్టె. ౨౮౬

ఉ. వాలుగడాలు క్రొన్ననల ♦ వాలునకుం జెలిజంకునొంది కాం
తాళము,బూని నేర్పుఁగల ♦ తట్టసమాటల నల్లవేల్పుతో
మాలిమిఁ బుట్టనిట్లనియె ♦ మన్ననసేయు మురంతులోన నీ
జాలము మానుమన్న నగి ♦ చామనమై దొరబల్కె వెండియున్.

క. కనుసన్న నన్నఁ జూపుచు
వినుమా చెలిమేము వచ్చు ♦ వీటిపనులు దీ
రినమీఁద నీదుకోరిక
లనుఁ దీర్చెదనింక నీకఁ ♦ లకునకుఁ జనుమా. ౨౮౮

క. అనిపలుక సమ్మతించి మ
రునిఁగన్నయ యచ్చోటువాయ ♦ రోకులుఁ దొలఁగన్
గనుఁబొలఁతి మానికంబును
తనయిల్లునుఁజేర జనియె ♦ తాలిమిగదురన్. ౨౮౯

తే. గీ. అనిని రాబారి చందురు ♦ డానతీయ
విని పరిక్షిత్తుఁడనురాజు ♦ వెన్నదొంగ
కతను జానుగులలరగ ♦ కలదలోన
హరున మిగురొత్త వెండితా ♦ నసియె జెలుచ. ౨౯౦

ఆ. వెన్నుఁడేగినంత ♦ వెలఁది కోరినయట్లు
కుబ్జమేడఁజేరి ♦ గోనెనోనుగము
దెలియఁ జెప్పుడయ్య ♦ తేటతెల్లంబుగ
వినెద యెనకమెనఁగ ♦ వీనులలర. ౨౯౧

(కలహంసోత్సాహవృత్తం)

వినపుతిండి తగరుకాతు ♦ వెనుకతేఁకు నెత్తులం
దెనగు బొమ్మిడికపు రవ్వ ♦ లెనయు తేజులొప్పగన్
ముసరిహజ్జదు గలఁగేలు ♦ ముడిచి ప్రొక్కి వేడగా
కసటుఁబాసి యలరనేయు ♦ కటియమేని వేలుపా. ౨౯౨

(తరళవృత్తము)

పసిఁడిసాలువ సెల్లనంద్రుని ♦ పట్టినట్టిద నీటియి
క్కనరిపేరులు రొమ్మునంగుడి ♦ కైన దాపటికేలునం
దెసఁగు సంకునుబిల్ల వాల్గొని ♦ హెచ్చిపుల్గు వాలునాయిపై
ససిఁగనెక్కి వయాళిసల్పిన ♦ సామిమేల్మలదాలుపా. ౨౯౩

( గద్య. )

ఇది శ్రీమద్రమారంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబకస్థిర
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వై
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల రంయాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతం
బైన అచ్చతెనుగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ప్రథ
మాశ్వా
సము

శ్రీ





శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( ద్వితీయాశ్వాసము )

క. సిరిచెలియెద కలవముతో

గరగరిక న్మొసలిప్రాసి ♦ గవురుసిరమొనా

మెరమెరఁ గలుఁగగ మలిపిన

మరునికి మరుఁడవగు వేల్పు ♦ మలనరసింగా.

వ. ఆలకింపుము. ౨

తే. గీ. నావిని వలంతిరుసితేని ♦ తోవెలంది

ముచ్చటలఁ దెల్పవినుమని ♦ మురిపెమలర

నట్లు నలమేని దొరతోడి ♦ యానవొంది

చనితనదు తావునకుఁ జేరె ♦ సంతసమున. 3

తే. గీ. తవరకన్నయ్య చేతముట్టడము వలన

వంకరలుఁబోయి మంచిమ ♦ వ్వంపుతనము

నొందె నావలపూట పూ ♦ టందరువుగ

మమ్మరించెను జవ్వన ♦ మెమ్మెతనము. ౪

క. ఆజవ్వన మంతంతకు
తేజుఁగలిగిఁనంతటికిని ♦ తేరినదా నా
హాజవ్వని ముజ్జగముల
తాజుగలుఁగువారి కనులఁ ♦ దగపండువయెన్. ౫

క. దాని మెఱుంగుల యొడలున్
దాని యొయ్యారంపునడలు ♦ తళ్కుగు తొడవున్
దాని నునుకురుల చకచక
లానలువయు గణుతిసేయ ♦ నలవిదె దలఁపన్. ౬

ఉ. రంగుమెఱుంగు నిద్దపుహొ ♦ రంగును మీరెడువాలుఁగంటిలే
మింగల కౌనుఁగాంచియెద ♦ మిక్కిలి నివ్వెఱగంది జంకునన్
సింగము నత్తినింగొలిచి ♦ చేవగలంపగ వచ్చిచూచి గ
ల్వంగడఁ గానకే చలిము ♦ లంగవిఁదూరెను నాటనుండియున్. ౭

ఉ. కన్నెకమోము చందమున ♦ గంగొన చీకటిగాము ద్రొంచి తా
చెన్నగ చన్నుగట్టులనుఁ ♦ జేరిన నందగలేకఁ గ్రక్కువన్
వెన్నునకేగనో యనఁగ ♦ వేసుకమీరఁగ వాలుగంటికిన్
పన్నుగ కీలుగంటుగను ♦ వట్టెను కన్నులపండువౌ లలిన్. ౮

సీ. కమ్మనినంబగు ♦ నిమ్మపండులఁజూచి
కత్తికోతలపాలు ♦ గాఁగఁజేయు
గన్నెరుగుత్తుల ♦ చెన్నువఁదోలఁగించి
పెల్లున గోరులఁ ♦ గిల్లఁజేయు
తఱిమల పెంపొందు ♦ తరివేల్పు వేలుపు
దాయలచేతులోఁ ♦ దరుఁగసేయు
జక్కవపక్కులు ♦ నిక్కనఁ గనుగొని
జోడువిప్పఁగసేయు ♦ వేడుకలర

గీ. ఇటులనఁబ్బును మెలిమి ♦ కటికెతినము
చక్కఁదనమగు వట్రువ ♦ నిక్కుచున్న
నసలుఁ బుట్టుఁగు మె ♦ ల్కంటి మిసిమిగుబ్బ
లలరె సింగార మెల్లనుఁ ♦ జిలకరింప.

క. మీలాకన్నుంగవన
ద్దాలా చెక్కిళ్లు విలువి ♦ తాలా బొమ్మల్
లాలా వాతెఱ మనమగ
ఆలాపలువరున మరుగు ♦ ఆలా పల్కుల్. ౧౦

క. చెందొవల దూరుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయు ♦ గేరెడడుగులున్
చందురు బురణించెడు మో
మందముగల చెలినిఁజూడ ♦ నబ్బురమయ్యెన్. ౧౧

క. విండ్లాబొమ్మలు తమ్మల
తూండ్లా కేల్ దోయిమిసిమి ♦ తోరం బగు పూ
చెండ్లా గుబ్బలు మొత్తని
దిండ్లా లలి పిరుదులలగు ♦ తెఱవకుఁ దలఁపన్. ౧౨

క. తమ్ములు కన్గవనన మొ
త్తమ్ములు మైతావిరామ ♦ తమ్ములు నుడులం
దమ్ములు మేన్మెఱుఁగులు గు
త్తమ్ములు చన్నంగడి పరి ♦ తమ్ములు సౌరముల్. ౧౩

ఉ. నెలసరిఁదూఁగు మోములలి ♦ నించిన కన్గవనిండు పండువె
న్నెలఁ సరిఁదూఁగు చిన్నగవు ♦ నీటగు నాచనుబోలు పెన్నెరుల్
నెలసరిఁదూఁగు మైవలపు ♦ నిగ్గనిగారపు బంగరంపు వ
న్నెల సరిఁదూఁగు మైమెఱుఁగు ♦ నెల్తుకమిన్నకుఁజూడ నబ్బమై.

చ. చిలుకలనంచ తుమ్మెదల ♦ చిన్నెలడంచు మడంతిసుద్దులున్
గులుకు నడల్ పొడల్ సొబగు ♦ కోల్మికొన వాతెఱపాజ్ఞులంగనుల్
చెలఁగిన మేనుతావి లలిఁ ♦ జిక్కిన వేనలిముక్కు సొంపులున్
గలిగిజగానఁ దీనిసరిఁ ♦ గానమటంచు పొగడ్డకెక్కినా. ౧౫

చ. వలదొరబొడ్డు కేళకుళి ♦ జాటరు మోమునుమామఁ జూడఁగా
వలఁచియు నుబ్బిక్కలందడలు ♦ చాటఁగలేక మె చాచిగట్టులం
గలుపఁగ సిల్లవంతెనను ♦ గట్టిన చాలనిగట్టినట్లు పొ
క్కిలి చనులంటియూరు వెలి ♦ గొల లలియూరఁగ కల్వకంటికిన్.

సీ. వలవిల్లుచే ముల్కి ♦ లను వగునఱఁటుల
కడువడిరా కొట్టు ♦ పొడలు దొడలు
కుందనపుం దళ ♦ కుల తెలిపిట్టల
కడరుఁ బుట్టించెడు ♦ నొడలునడలు
చిప్పఁదాల్చినవానిఁ ♦ జప్పగొలిచ్చిన వాని
నీళ్లలో మంచుమీ ♦ గాళ్లుగోళ్లు
పులుకాసి పులుఁగులఁ ♦ బొలుపు కెంద మ్ముల
బిడియము నొందించు ♦ నుడుగులడుగు

గీ. లనుఁగుచేపల మలమించు ♦ కనులు చనులు
మించుసంకును బ్రుబ్బును ♦ మెడయు జడయు
పొలుపు సంపెగియద్దముల్ ♦ ముక్కుచెక్కు
లనఁగవెలఁదికి పెంపొందె ♦ నారబళిర. ౧౬

క. డాలాపిక్కలు కొంబవ
డాలాకెమ్మోవి తమ్మి ♦ డాలా యడ్గుల్
వాలా చూడ్కులునునుసవ
రాలా జడకీవి బొంగ ♦ రాలా చన్నుల్. ౧౭

సీ. కానరానడుగుల ♦ కాని బాముల నంద
గాఁజేయుఁగాఁ జాలు ♦ కలికి మోగు
నీటిపుట్టుఁగు నెఘ్ఘ ♦ నీటఁబుట్టఁగ నేయు
కొమరారు సొగసైన ♦ కుతికెతీఁగు
పల్ గొమ్ము మొకముల ♦ బల్సిగ్గు నొందించు
నవల మెల్ రతసంపు ♦ నగలబొమి
పదియారు వన్నెల ♦ బంగారు నిప్పుల
నుడికింపగాఁ జేయు ♦ నొడలసౌరు

గీ. పువ్వముల విల్లుచేవట్టు ♦ పోటుకాని
కిగలవాలును మించున ♦ ఘన్నగువచూపు
లలరు కెందమ్ములను వ్రక్క ♦ లలరసేయు
కన్నుఁగవయొప్పె కలికికి ♦ చెన్నుమీర. ౧౯

చ. అనగడమంది లచ్చిచో అహా యని ♦ బిఁతునుమిత్తి గొంగక్రొ
దవులఁగ యాంమిటారి మొలఁ ♦ దాగిన యంతిరి తేరుగంటు నా
రివిలుల కోరులుం బెఱవి ♦ రెప్పవు నుద్దిసారంబు ముంగురుల్
దవులుఁగ బొమ్మచూపుల వి ♦ తంబయునం గొనబెట్టె సొమ్ములన్

సీ. అచ్చెలిమేత్నెలు ♦ పొచ్చపుకానెంచి
తెలవాయి మొకములుఁ ♦ బొటియదూటె
కల్కిపల్కుల కుల్కి ♦ పిల్కచిల్కల పొజు
లాటతోటల వ్రాకు ♦ లలరఁబాటె
యకల్కి కెక్కుడై ♦ సిక్కునారిదలంచి
నెట్టనసప్పము ♦ ల్బుట్టఁజేరె
కడువడి చేడియ ♦ నడలకు నెడఁగార
యంచల నొడలుతె ♦ ల్పాయమైనేల

గీ. సంపెగింపు పరిథ ♦ వింపనో ముక్కును
కెంపు సొంపుపెంపు ♦ నొంపుమోవి
మెఱుపు నొఱపుసేయు ♦ బఱిపెను నెమ్మోము
చందమామ యందు ♦ మొందుమొగము. ౨౧

ఆ. తూలమేలుఁ దూలఁ ♦ జాలుకన్గవతిమ్మ
పూలఁబోలుకేలు ♦ మేలుచీఁకు
వాలుకీలుగంటు ♦ లాలుఁదేలిన మోవి
డాలుపూలగు దెల ♦ నేలుచనులు ౨౨

సీ. తమ్మలు వ్రక్కలై ♦ తళుకుఁబోవిడెతీలలో
పొట్టలఁ దాబేళ్ళు ♦ బెట్టుకొనియె
అఱఁటులు గొడ్డంటె ♦ నఱుకుళ్లఁ బడిపోయె
సింగముల్ గవులలో ♦ జేరిడాగె
వసిఁడిచెంబులు నీట ♦ బల్మారు మునిఁగెను
తావిమంకెన విడి ♦ తఱుచువాడె
కెంపుకంటులు కానఁ ♦ గేరుకొమ్మలఁ జేరె
నప్పుము ల్వేసపావ ♦ జగముఁ చొచ్చె

గీ. హజ్జదుగలకు మీగాళ్ల ♦ కలుపుతొడల
కరయు నడుమునకును చను ♦ లలరుటకును
కీలుగంటు సొరంబునుఁ ♦ గేరుమోవి
కెలమినోటమి జెందుచు ♦ లలిదొరంగి. ౨౩

చ. చిలుకలు నప్పుముల్మెఱుపు ♦ చేపలు నచ్చెలివల్కు కీలుగం
టులలిని మేనుకన్నులు పో ♦ టుక్కునఁ గన్గొని గెల్పు లేకకొం
మ్మల వెనఁజేరె ♦ బుట్టలను ♦ మాళ్ళముమైగొని దూఱెబైలునన్
వలనుల మీరె హెచ్చు గరు ♦ వంబునుబోవిడి నీటఁబారెనా. ౨౪

సీ. చిన్నిచీమలఁబారు ♦ చెలిమిన్ననూగారు
మామచెల్వాను మీఁదు ♦ మోముదాఁటు
తాఁబేళ్లు మీఁగాళ్లు ♦ తళుకుచుక్కలు గోళ్లు
నెఱకలడాళ్లు వ ♦ న్నియనెమళ్లు
వడియారువన్నెల ♦ బంగారుమై తీగ
కారుసవ్వము జడ ♦ సౌరుగేరు
పలుచాలు ముత్తియం ♦ బులఁబారు బోదూఱు
పిల్కచిల్కలపలుకు ♦ కల్కి పల్కు

గీ. కమ్మనగుతావి మైతావి ♦ కావిమోవి
కళుకుతమ్ములఁ గలహోయి ♦ కన్నుదోయి
నూవుబువ్వుముక్కు సద్దంపు ♦ తేవచెక్కు
లలరు ననచెండ్లు పాలిండ్లు ♦ చెలువకలగు. ౨౫

ఉ. తమ్ములదారు తేజు తెలి ♦ దమ్ములబాజు తళుకుమించుట
ద్దమ్మరువాణముఁన్ గలిపి ♦ తగ్గని నిగ్గునుఁదీసి బమ్మతా
నెమ్మని వేల్పు జవ్వనుల ♦ నివ్వటిలంగను సేయునట్టులీ
కొమ్మ మొగంబెలర్పమతి ♦ కోల్కనె చెక్కలి కన్నులున్నగుల్.

క. ఇట్లా చెలికతివేలుపు
మాట్లాడిన మాటలకును ♦ మల్లిఁడిగొని తా
కట్ల విరివిల్తుఁ డొసఁగఁగ
చాట్లకు వెఱగంది మేడ ♦ చక్కికి జేరన్. ౨౬

క. అట్టితరుణమున ననకా
రుట్టిపడెక మగలఁజెలుల ♦ హాయలకు బలుకుం
బిట్టలకును రా తెలినెఱి
పిట్టలకుం గోయిలలకు ♦ పేరిమిఁబుట్టన్. ౨౭

తే. గీ. వరలు తరియనుచిత్తారు ♦ వ్రాయువాఁడు
విరిహాదన తేని కెదలోన ♦ వెక్కఁబుట్ట
కెంపురాల్గూర్చి కొలువున ♦ కేరికాన్క
బెట్టెనోయనఁ జిగిరించెఁ ♦ జెట్టులెల్ల. ..౨౯

సీ. కొండాట మెదఁగల్గ ♦ గోరువంకలగమి
వంగడంబులు వగ్గ ♦ వరుసదెలుప
చిగురాకు మేపరి తో ♦ గల కోలలవారు
సొరదిముందర బరా ♦ బరులు నడువ
పులుకాసిపులుఁగుల ♦ పొదులు దండితనంబు
కుత్తుకలెత్తుచు ♦ కొసరుచుండ
కొదమతుమ్మెద గాణ ♦ లెదనసలారంగ
పసగలపాటలు ♦ బాడుచుండ

గీ. యంచపులుఁగులు చెలరేగి ♦ యాటలాడ
తివియలను కొమలుపారతు ♦ ల్దెచ్చిపట్ట
గాలిపడిగాపు వెంబడి ♦ రాలలిఁగను
వచ్చెననకారు కందువ ♦ పాదుసాహి. ౩౦

ఉ. తాలిమిపూల కారనేఁడు ♦ దాది సరాసరి మారువాణమా
పాలడలందు తియ్యనగు ♦ పాలనుఁగూర్చిన యుగ్గునింపిమే
ల్మేలని తేటిపిల్లలకు ♦ మేకొనివచ్చె ననంగకమ్మనీ
ర్వాలెము నిండిపూవుగమి ♦ బాగుగబూచెను తీఁగెలన్మనన్. ౩౧

క. చిగురులచే నాకులచే
మొగడలచే పలు వితాల ♦ పువ్వులచే చెం
గుగ కాయలపండులచే
దగవెలిగెన్ నిండువిరిహా ♦ దను మేల్మేలై. ౩౨

తే. గీ. అంత నట్టింటిలోఁగడ ♦ నందములర
పడుకగదిలోన బంగారు ♦ పనిచెలఁగిన
గొలుసు తొట్టియుపై ప్పూల ♦ కుదురుఁబరచు
పాన్పుఁ గనుఁగొని పైకెక్కి ♦ పవ్వళించి. ౩౩

క. నిట్టూర్పులు నిగుడఁగనొక
దిట్టరిఁ గనులారఁజూచి ♦ తిమ్మనలేకే
రట్టడిదేవర నేమని
దిట్టుదునిప్పుడోర చామ ♦ దేవరఁ బాపెన్. ౩౪

క. పిమ్మటను హెచ్చరించియు
కమ్మని విలుకాఁడుత్రుళ్లి ♦ గరకతిలేకే
తమ్మిములుకులను నెదపై
గ్రుమ్మెననుం బొమ్మసిలఁగ ♦ కువ్వాడముతో. ౩౫

ఉ. బెగ్గిలిబేలనైతినిఁక ♦ బేసిలకోరుల కానితండ్రిపై
నిగ్గులు నాదుకన్నుఁగవ ♦ నిల్చెను చక్కెరబొమ్మ యింకపై
వగ్గను వానికేదొక నె ♦ పంబిడి నాదగు చెంతఁ జేర్చినన్
నిగ్గదలేకపోయినను ♦ నిచ్చయమిచ్చట మోసపోవుటల్. ౩౬

క. అనిఁ బొరలుచు మైమరచుచు
వినుఁజూచుచుఁ దెసలనెల్ల ♦ వెఱ్ఱిఁగఁ గనుచున్
ననవిల్తునిఁ దూఱుచుఁ గ్రొ
న్ననబోఁడి వితాకునొంది ♦ నసతను మునిఁగెన్. ౩౭

తే. గీ. ఇటుల దమకంబుఁ గొనియొడ్డ ♦ కటకటపడి
మైమరచియున్న చెలియను ♦ మగువలెల్ల
చూచి చలువపనుల్జేసి ♦ సొద్దైన
మాటలనుఁ జెప్పిరవ్వాడు ♦ మంచిగలుఁగ. ౩౮

క. ఓనవల యీ విరాళిం
బూనికుమారిల్లుచుండి ♦ పుయిలోటమిచే
నానఁగొని మాకు నీవ
క్కాణము వినుపింపకిట్టి ♦ కటికము మేలే. ౩౯

క. తగుపటవె తామరాకున
నిగులన్విసమొల్ల మ్రబ్బు ♦ మేవరిపీచన్
దగుఁక కదలినవైపున
మగువామాకఱఁ దలదరె ♦ మలికితె మొప్పన్. ౪౦

తే. గీ. అయిన యిటువంటి పనులెవ ♦ నానుకొన్న
పాదనుఁగోలెను ప్రొద్దేగ ♦ హోయిమీర
వరలు వోమనగుంటలు ♦ వలపుఁదీర
నెత్తములనాడ బాగగు ♦ బిత్తరమున. ౪౧

క. చెలియేరికి కళవలమొద
గలిఁగిన తోయమున చెల్మి ♦ క్రొల్గంటులతో
మెలఁతోఁటలోనఁ ద్రిమ్మరు
టలలిచేఁగునమ్మ నక్క ♦ టాబోద మొగిన్. ౪౨

క. అనుచు నొయ్యారికి నుడివిన
వినితీఁగ మెలుంగుతోడ ♦ వెంఁడిమొడలి నె
ల్లనెగాదిగఁ జూచుచు వా
కొనె బంగరుబొమయు మరుని ♦ కోమయగు కోమయున్. ౪౩

క. ననఁబోఁడి నీమదింగల
పని సేయుమటన్న చెల్మి ♦ పడఁతుక వేగన్
పసికత్రైల హెగ్గడీక
త్రైను బంపితలంపులెల్లఁ ♦ దెలివిడి సేయన్. ౪౪

ఉ. వారెకలోనఁ బొంగి చెలు ♦ వంబగు పల్వలుఁ దాల్చి తోఁటలో
మూరుఁగ ద్రిమ్మరిల్లుటకు ♦ బుగ్రటకొమ్మలు సొమ్ములెల్ల సొం
పారఁగ నంది గుంపులయి ♦ యారట మొందెడు కుబ్జచెంతకున్
జేరి యలర్పు మీరఁ బలు ♦ చిట్టక మొప్పఁగ కేల్మొగిడ్చియున్.

క. హరుసించి వారి నంగతి
సరిఁజూచి బిటారమిం ♦ పెసఁగ నిలుడంచున్
సొరదిగ నుత్తరువిడెనొ
క్కరి నందులఁ జీరి బలికె ♦ కమ్మని నుడులన్. ౪౬

క. ఓనవలా యిచ్చోట నిక
తానకమైనను నికంబు ♦ తహతహ లెదలో
బూనుచెలఁ దోఁటఁ ద్రిమ్మరఁ
గానలఁ కువఁ బోవునంచు ♦ కటఁద దలఁచితిరే. ౪౭

క. అనవా రొయ్యారుటామా
టనువిని చెలితోఁ పునకువాలు ♦ టాహాటి బోవన్
దనుకు విడిఁబోవు విగ్గమా
మనవినిచే కొమ్మకొమ్మ ♦ మంచిదిరమ్మా. ౪౮

ఉ. నా వినిరొక్క చెల్మిగల ♦ నాతి మెఱుంగు బుజంబుపైనకై
తేవఁగ లిర్పవేసి తన ♦ కెంకిని వే విడనాడి పూవుబోం
డ్లీవల నావలన్నడువ ♦ నింపగు తోఁటనుఁ దారుచుంటకై
ప్రోవుఁగ తూడుతిండిగమి ♦ పొల్పగు నెన్నడలం జనందగన్. ౪౯

ఆ. వె. పోయిపోయి యెదుట ♦ పువ్వుల జొంపము
లలరకమ్మపొదల ♦ చెలుల పాజు
గాంచి యెదలమెచ్చి ♦ కలికి మేటి రొక్కర్త
కుబ్జ చెంతఁ జేరి కూర్చి ♦ బలికె. ౫౦

మత్తకోకిలావృత్తము

కమ్మరేగునసంటి పాదిరి ♦ కాంచనంబుకచోరముల్
నెమ్మిచండ్రిసనాస మోదెశ ♦ నేలతామర రావి దా
ళిమ్మ వేము తినాసయున్నొగ ♦ లింగమంకెన మోదువుల్
కొమ్మమానికపూకనుంగొను ♦ కోర్కెలుప్పొంగులూరఁగన్. ౫౧

కరిబృంహితవృత్తము

కోరితోలకరి సూడ్లు వలకులు ♦ క్రొంచలికుకలపుల్గులున్
బైరులును పులుకొసిపులుఁగులు పావురములుకుకలావుకల్
సారెలును జతిజుట్టుపులుఁగులు ♦ జక్కవలు నెలఁ బొవుడుల్
మీఁగ వలపుల రాయుడురమున ♦ మేలుగా దిరిగాడె నే. ౫౨

తే. గీ. వెలఁది జాజినిప్పూగురి ♦ వెందజుట్టఁ
దోఁచెవగ కాండ్లొకర్తను ♦ తోరమొదను
గలుఁగుచుండఁగ జేసాచి ♦ కౌఁగిలించు
వితముఁగన్పడెఁ జూడుము ♦ వింతఁగలుగ. ౫౩

చం. చెలువపుదాఁడినిమ్మలను ♦ చిల్కలుముక్కుల నొక్కుచున్న నా
చెలుఁటుఁ జూచి జంకెడద ♦ జేరఁగను త్తల పాటుఁజెందిరా
వలపులతేడు మావివిరి ♦ వాలికతూపులఁగూర్చి రోసముల్
కలుఁగ వెలందిమానికల ♦ గట్టి చనుంగవ నేయుచుండమై. ౫౪

కం. వగదొండపండుపై సొం
పుగ వాలుగడాలుగురము ♦ ముక్కునిన చో
వ్వఁగనినఁ దగె మొగఁడొక చెలి
నిగనిగమను మోవినొక్కు ♦ నెఱిగనుపడియెన్. ౫౫

వజ్రహారవృత్తము

తిమ్మఁగలిఁగిచూడ వెచ్చెలి ♦ తీవగుంపు చెంగటన్
కొమ్మలోటులేక మొగలగూడియుండె నర్మిలిన్

తిమ్మఁగల్గిచూడకె చెలి తీవెగుంపుచెంగటన్
కొమ్మలోటులేక మొగలఁగూడియుండ్రినర్మిలిన్. ౫౬

కం. పూవులకమ్మని తావులు
తావుల సొగసైనయొజ్జఁ ♦ పనముగు మావుల్
మావుల సొంపగు తీవెలు
తీవెలఁగడు ప్రిదిలిననలు ♦ తీరగుక్రొవ్వుల్. ౫౭

చం. నెలఁతుకలెల్లరా మొగము ♦ నీటగుదమ్మిలఁజూచి తుమ్మెదల్
వలచి తమరీనవచ్చి చెలు ♦ వంబున మూకొని కమ్మనీటికై
మెలఁగుచుముక్కుగాం యుత ♦ మిన్ గొనసంపెగయుంచుసారెకున్
సలుకువఁజెంది జంకులెద ♦ నాటఁగ ద్రిమ్మరిలెన్వెలందుకా. ౫౮

కం. ఈరమణముద్దరాలికి
నారెము నంటలుఁగువింత ♦ లరుసములొలుకన్
గారహిానిఁ జెప్పనువ్విళు
లూరఁగ నొకరొకరుఁగూడి ♦ నువిదెవినంగన్. ౫౯

తే. గీ. ఒక్కముడఁతుకహాసంబు ♦ పిక్కటిలఁగ
కేకినలుఁగొట్టి పూపొద ♦ రోకుఁజూపు
ప్రేలఁజూపుచు నయ్యాట ♦ ప్రాలి చిలుక
పిల్కపల్కను బల్కెను కుల్కులొల్క. ౬౦

ఉ. పుప్పొడి దీవులున్ ననుచు ♦ పూవుల తావులు విచ్చుక్రొవ్వులున్
గుప్పనిమావులున్ గమియు ♦ కొమ్మలరేవులుఁగల్గుచున్నవో
పుప్పుఁబోఁణులార చెలువుం ♦ గల నీమెలఁదోఁటలోననీ
టొప్పఁగ నాటలాడుటకు ♦ నొప్పను సోమదొలంగునర్మిలిన్. ౬౧

కం. అని వాక్రుచ్చిన చేడియ
విని మదిలో బాళిఁజెలఁగ ♦ వీఁకను నొక్రొ

న్ననఁబోడి బుజముపై చే
తిని వేసి యొయ్యారమొకవ ♦ తిరుఁగఁగఁజనియెన్. ౬౨

చం. చసకనె బొమ్మరిండ్ల హారు ♦ సంబుసలేపెనుబట్టి కాండ్రఁ తెం
చెనుమసతమ్మితూండ్ల పసఁ ♦ జెండఁగఁగట్టెను పూలచెండ్ల నె
మ్మిని దినుకమ్మపండ్లకలి ♦ మింగనుగోసెఁ గుత్తిదండ్లనా
డెసట పసిండిగిండ్లలలిఁ ♦ డీకొనఁగా జవరాండ్రగూడియున్. ౬౩

ఉ. కొమ్మలనత్తమిల్లు విరి ♦ గుత్తులగోరులఁగిల్లుగేసఁగిన్
బొమ్మలనల్లు పొన్నసన ♦ పుప్పొడిచేతులఁ జల్లుతావిపూ
రెమ్మలగిల్లు కందుపగు ♦ రించిన తానెదఁదూపటిల్లు చొ
క్కుమ్మడి సొమ్మసిల్లు మది ♦ నోటమిఁగల్గిన పెల్లుపెల్లునన్. ౬౪

ఉ. మొల్లలఁజూచి సిక్కు నుర ♦ పొన్నలసీడలఁదక్కు పండులన్
కొల్లలుఁగాను మొక్కు పువు ♦ గుత్తులతా సిగలోన జెక్కుమేల్
మల్లెలఁగాంచి సొక్కునన ♦ మావులగన్గొని యొక్కుజేజెక్కె
యుల్లములోన మొక్కుచను ♦ వొప్పఁగ జిక్కుపడంతిదాటుకున్.

కం. ఈపరుసుసఁ జెరలాఁడుచు
నాపఁడతుకమిన్నకోటి ♦ యతివెలకెల్లన్
బూపొదలఁనిచ్చఁ దిరుఁగం
గావగ్గఁజెలంగయాన ♦ గావించెనొగిన్. ౬౬

తే. గీ. యాననిచ్చినతోడనే ♦ యలరుబోండ్లు
కాలుకారగు పొదలను ♦ దూటిదూటి
యంచలకా సిగ్గుఁగదుర నొ ♦ య్యారమొదవు
నడలనడుచుచు కొందలు ♦ నవలలపుడు ౬౭

కం. చిల్కలగొల్కి యొకతె పం
డులఁగోసెను క్రొత్తసనల ♦ డులిచెనొక కో

యిల కుత్తుక తుమ్మెదచా
యల నెఱుకలఁబోటిఁ ద్రావె ♦ నలవడు తేనెన్. ౧౮

ఉ. రవ్వలు కెంపు లుసిరి విఁ ♦ గాలిఁగఁగూర్చిన కోటయోయనన్
మవ్వపుతీవెయిండ్లనడు ♦ మన్నెలగాలనుఁ దీర్చిగద్దెపై
జవ్వని యోర్తుకూరుచొని ♦ సారెకు సారెకుఁ బీనె సారెలన్
నవ్వుచు బిగ్గజేసి వల ♦ నంగడు పాటలఁ బాడె నత్తఱిన్. ౧౯

ఆ. వె. మత్తియాడ నెక్కి ♦ మగువనిన్ను యొకర్తె
యూగుచుండ బిగువు ♦ నుప్పరంబు
నంటబోయి మనసు ♦ మింటికెలంకు కెం
దమ్మి గమినిదన్ను ♦ తమకుఁదోచె. ౨౦

ఉ. తియ్యని మావిపండులనుఁ ♦ ద్రెంపియు కుప్పలుబెట్టి యొక్కమే
ల్తొయ్యలిపాటి చేడియ ♦ తోఁదగగేనఁగి బొమ్మ పేరణం
బొయ్యనఁజేసి నెయ్యమున ♦ వాలికఁ పాటలఁ బాడి కొంతతఱిన్
వియ్యపురాండ్రటంచు మఱి ♦ విందొనరించె నోయూర మొప్పగన్.

క. తేటుల మొత్తము కమ్మని
తేటంగల తేనెఁ ద్రావి ♦ తిరుగఁగ నెమ్మిన్
బోటియొకతెఁ జిలుఁగుముకున్
బోటిఁగఁ జూపించి వాటి ♦ పురి విప్పించెన్. ౨౧

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల ♦ చెండులాఁడు
తరి నొకటి నొక్కరిత పైటఁ ♦ దవిలిఁ జిక్క
మూఁడు పాలిండ్లుఁ గలిఁగిన ♦ ముగువ యనుచు
పాలతులందఱు నవ్విరి ♦ పొల్పు వెసఁగ. ౨౩

క. కంటుతనంబున తుమ్మెద
కంటువు పువ్వునొక్కవాలు ♦ గంటి కొనుచు ప

ల్వంటి ముకునకును గాదని
వంటవలఁతిపైన మరల ♦ బారఁగ వేసెన్. ౭౮

ఉ. తింట్లకు కమ్మనై మెసఁగు ♦ తేటులువాలెఁడు వూలగుత్తి పూ
బోండ్లకు వ్రేలఁజూపి చల ♦ మునమ్మదిఁబుట్టఁగ జూచి నాదు పా
లిండ్లకు సాటిరావనుచు ♦ లేచుయొకర్తుక కెంపుఁబార లేఁ
దూఁండ్లనుఁబోలు కెల్దుగల ♦ తో విఁజళించెను హా సుమీరగన్.

క. నవల రతనంబు లొకయెడ
గవకవలుఁగ యొకరికొకరు ♦ కమ్మని నుడుల
న్వివరించిరచటి సొద్దెము
ల వలపులుసిమ్మర మొగము ♦ లను నవ్వొలయన్. ౭౯

సీ. అలమావిఁ జేదుగ ♦ లంట నెచ్చెలి యొర్తు
గోరంట కౌఁగిలిఁ ♦ గొనె నొకర్తె
పొగడఁగల్లు మివేసి ♦ పూఁబోడి యొకరిత
కంగేలిఁదన్ని నొ ♦ క్కరిత నగిమొ
పొన్నదావునఁ జేరఁ ♦ బోయి నొకర్తుక
గోగుల మేల్నుడి ♦ కొసరె యొకతి
చెలియోటి వావిలిఁ ♦ జేరి నిట్టూర్పిడి
నొకతిఁ బొట్టుఁగు నక్క ♦ టికమునఁ గని

తే. గీ. ప్రేంకడంబుల నొకసకి ♦ ప్రేముడి వగ
మేలుపాటలఁ బాడియు ♦ మెలఁత యొకతి
సంపెఁగిని పాటమొగమున ♦ సొంపుమీర
పుప్పములఁ గల్గఁజేసిరి ♦ పూనికగను. ౭౭

(ద్వి ర ద గ తి ర గ డ)

కలికి కనుతోఁట సిం ♦ గారముల గారముల
పొలఁతులకుఁ జల్లుగం ♦ బూరలను బూరలను

దట్టించి మొక్కవిరి ♦ తావులను తావులను
మెట్టవే విరివిఁగను ♦ మేనశిల మేనడిసి
కూటువుఁగ దూఁకుమనె ♦ కొమ్మలను కొమ్మలను
నీటుఁగా దెమ్మ దా ♦ నిమ్మలను నిమ్మలను
పాలుపొంద యేఱునుర ♦ పొన్నలను పొన్నలను
గలుకరించెదు నేగ్గు ♦ గున్నలను గున్నలను
నిలచి యూపితిని గ ♦ న్నేరుపూల్ నేరుపూల్
వెలుఁగ సిగఁజెక్కుకుదు ♦ వేగులను వేగులన్
తిరిగి నవ్వలకేగి ♦ తేనెలను తేనెలను
తిరముగా దిద్దు వలఁ ♦ తీనెలను తీనెలను
చేరుగాకూర్చు మట ♦ జిగురులను జిగురులను
పోరేల మల్లియల ♦ పొగడలను పొగడలను
తెలిచి చూడుము గిరక ♦ త్రోడులను త్రోడులను
వెలిపేలనిక కుబ్జ ♦ వేడుకము వేడుకము. ౨౮

క. ఈరమణ నొకరి కొక్కరు
వేరులతో వారి వారి ♦ బిలుచుచు తమదే
వేరిని వేడుచు నచ్చట
కోరికలూరంగ నాడు ♦ కొనఁదగు ననుచున్. ౨౯

క. బుజములకై లోడ్డుచు చెలి
వజలిరువంకలను నిలిచి ♦ పరిధవ మొప్పన్
గుజగుజ రేకుల నాఁడిరి
గజిబిజి యెడలోన వదిలి ♦ కానను వేడ్కన్. ౩౦

తే. గీ. తీగ యారములోఁ జేరి ♦ తెలివమిన్న
లెదల హారుసంబు బెనఁగొన ♦ నద్దఁటఁ గలిఁగి

కొంతవడికిని నలుగురు ♦ గూడిగూడి
యచ్చనాలాఁడిరచ్చట ♦ యిచ్చదీర. ౮౧

క. ఉప్పచ్చులు ♦ గొబ్బిళ్ళను
కుప్పిలునుదన్ను బిళ్ళ ♦ గుడిగుడిగుంచా
లుప్పెన బట్టెలు ♦ నిరికి
ల్దప్పకనాఁడిరి మురిపెము ♦ దళుకొత్తంగన్. ౮౨

వ. ఇట్లాజోటిమేటి బోటికత్తియల కూటువల కూటమితోయాట
తోఁటఁజేరి చెలువిలుతు డొరబెట్టికిన నిగనిగ మెఱుగులీను
విరికఱుకుటమ్ముల నెఱిమీరి నత్తెఱవ కడకంటి చూపుల నెల్ల
దెసలఁ బరికింపుచు కమ్మనితమ్ముల కమ్మనీరు నెమ్మినిదమ్మదీరఁ
ద్రావి మమ్మరమ్మ మమ్మరించ జుమ్మజుమ్మన రోదాళమ్ములు
సేయు తుమ్మెదల మొత్తమ్ములు కొమ్మల ముంగురు లొక్కు
మ్మడింగని తమకొలమ్మని లేచి ద్రిమ్మరిల్లుచున్న గఱుల చాయ
లంజూచి నిబ్బరంబగు ప్రుబ్బులనిగొబ్బున నుబ్బుచు తమతమ
పించియమ్ములవిప్పి తుంపెసలాడు పింఛెవుకుంచె పిట్టలను మెల్లె
మెల్లెన కాలియందియలు గల్లుగల్లుమన నదలించుచు గుబ్బకొను
గబ్బిగుబ్బల బరువున పిడికెడు మేరఁగల నడుముగడగడ వడుకుచుండ
వెడవెడ నడుకలు తడబడగ రాయంచల కొయ్యారంబుఁజూపుచు
చల్లని పిల్లగాడ్పులు మెల్లెమెల్లెనవీన తెల్లని మొగడలు కొల్ల
లుఁగ వెల్లివిరియ మల్లియలపొదల నల్లనఁదూఱుచు జారుబండ
లం జారుచు గొప్పనగుచలువ చప్పరంబులఁదారుచు మెప్పముఁ
గల యరంటితుప్పల దెవ్వలగు కప్పారంబుల తావుల కప్పడవ్వడు
జేయుచు పువ్వుఁ బోడులపై పుప్పొడులఁ గుప్పుచు చిన్నిచిలుకల
వలుకులకులికి నిలుకడలేని డెందంబున వానిని రొప్పుచు తఁసారం
బునకు కోయిల మొత్తంబులీడుగావని బిత్తరంబున తత్తరంబులేని

10

సారంబుల కూయుచు పువ్వుటీరంబులం డాయుచుఁ జక్కవ పక్కులు
నిక్కవచ్చిన సొగసుగల తొగలరాయని నిగనిగలదగులు మొగ
ముంజూపి దిగులుఁబడ సేయుచు పూలగురివెంద పందిరుల నెక్కుచు
తియ్యని మావిపండుల మెక్కుచు నలరుల నేలబడ రాల్చి తన
యొడలి గందమునకు సరియని తమకంబున యెదజల్లుచు తనయిచ్చ
గలతలంపొడఁగూడ సేయుండని కాన వేల్పులకు మ్రొక్కుచు
నా సింగారంపు టెలఁదోఁటలో పలువితంబులైన సొద్దెంబులు
తద్దయు ముద్దియ సూచుచు గ్రిమ్మరిల్లుచుండెనంత. ౮౩

తే. గీ. ఇటులఁదిరుఁగుచు కుబ్జయు ♦ నింతులపుడు
నలసిసొలసియును స్సర ♦ టంచుచందు
రాఁదొగల్ జెక్కగద్దియ ♦ రానఁగలుఁగ
గూరుచుండిరి ♦ కమ్మని పైరవీవ ౮౪

తే. గీ. చెలుల మొగముల చెమ్మటల్ ♦ చెమ్మరించ
చెఱఁగులను బండుటాకుల ♦ జేతబట్టి
పొసఁగ బడలికఁబోవంగ ♦ విసరుకొనుచు
తియ్యనుడి కారమున నొక ♦ తెఱవఁబలికె. ౮౫

తే. గీ. వింటిరే మీరు మనుని వా ♦ ల్గంటులార
యిచటఁగూర్చుండ మనకింక ♦ నిజుకుఁగలుఁగు
గానకమ్మని చల్లని ♦ గాలివీచు
కొలఁకులను జేరి సీరాడఁ ♦ గలుఁగులగ్గు. ౮౬

క. అనవిని మంచిదటంచును
ననఁబోఁడులు గుంపుఁగట్టి ♦ నంగుబ్జయుఁదా
జననిచ్చఁబూని తా మె
ల్లనిమాటల సాటిలేమ ♦ లకునిట్లనియెన్. ౮౭

తే. గీ. జుట్టుపిట్టలు పొదరిండ్ల ♦ పట్టుఁజేరె
వెలుఁగు దొరరాల మెలకువ ♦ లొలికెవెచ్చ
వెలుఁగుచే బాటసారుల ♦ పొలుపుఁజారె
పట్టఁబవలాయె నిక్కాన ♦ మిట్టిపడును. ౮౮

క. వడగాలి రేగ నీడలు
కడుపొట్టివి యయ్యె ♦ పులుఁగుగమి చెట్లపై
విడిదిఁగొనె నాగుబాములు
గొడవము నన్వాడిరోజు ♦ గొనిపవళించెన్. ౮౯

ఉ. పూపొదటెంకియా చెవుల ♦ పోతులు మిక్కిలి వేడియెండచే
దూఁపిలికాలు నాకెపస ♦ దున్నలు నీటిబిడారు పంకిలో
తేపకు తేపకుంబొరలె ♦ తెల్లమెకంబుల కూటువుల్లవిన్
గ్రైవుపగర్పు నొందె, బసఁ ♦ గాగొనెనంచలు తమ్మిజీబులన్. ౯౦

ఆ. కానయిట్టి తరిని ♦ కమ్మనిచల్లని
గాలివీచుచుండఁ ♦ గా కొలంకు
జేరి తానమాడ ♦ దూరిబోవుసరము
మంచిబలికితమ్మ ♦ మరునికొమ్మ. ౯౧

క. దిట్టరియీవగఁ బలికిన
కట్టడికిని హరుసమెల్లఁ ♦ గ్రమ్మంగనుబల్
రెట్టింప నవలలందొఱు
నట్టుంగొట్టక యెడఁదల ♦ నాణెము గలుగన్. ౯౨

తే. గీ. ఉండనొక్కతె యందులో ♦ నుండిలేచి
నాల్గుదెసలనుఁ గనుఁగలి ♦ పుల్గుగములు
లేచి వాలెడుచోటుల ♦ లింగనిమఱి
పొలఁతుకలనుఁ గనుంగొని ♦ పలుకుఁబలికె. ౯౩

చ. మగువల మిన్నలార విను ♦ మానమునౌ యొకతమ్మిఁగొల్చునను
డుగమనికల్ వెలింగె సెగ ♦ మంకును దాసినిచూచునంత జా
గుఁగొనుటకేల యింక మన ♦ కోయనఁ జేడియలొక్కపెట్టునన్
సుగము సెలంగి కమ్మ విను ♦ చూలియువీవఁగ లేచిరంతయున్. ౯౪

ఆ. లేచి వేడ్కతోడ ♦ లేమమేల్బంతులు
తూడుతిండినడల ♦ తో నొయార
ముప్పమల్లెమొల్ల ♦ తుప్పలఁబొదలచే
తనుఁ జెలంగుఁద్రోవ ♦ దమినినడచి. ౯౫

క. సరివాల్గంటులు నెదుటఁగ
నిరిమెద బాఁకిన్నెలంగ ♦ నెగడువిరాళిన్
దరఁగల తేటిరవాళిఁ
గెరలఁగ పుల్గులపిసాళి ♦ కేళాకూళిన్. ౯౬

చ. కనుఁగొని వేడ్కతోఁ గలువ ♦ కంటులు తీఁగమెఱుంగుఁబోఁడి వెం
టనుఁ జనికేకిసల్ జరచి ♦ డంబగు వేల్పులవాకనెల్లత
చ్చనముఁను సేయునంచు నెద ♦ సంబరమొప్పఁగ నొడ్డుపొంటినుం
డుననలతీవె జొంపముల ♦ డొంకుచు నందొకకొమ్మవాకొనెన్.

క. ఈకెందామరల హారం
గీకలువలరోకు కదుర ♦ రహిన్ విసములసా
రీకమ్మఁగాలి రమణం
బీకొలనునఁగాక నేల ♦ నేకొలనున కా. ౯౭

(త ర ళ వృ త్త ము)

మొలను మేల్కయిదమ్మ లానుచు ♦ ముద్దరాండ్లాయొడ్డునం
నిలచియచ్చోటఁ గలుఁగుచుండిన ♦ నీటిసొద్దెములప్పుడా
చెలువమిన్నకు విన్నవించి ప ♦ సిండియుండెలు గల్మనన్
నెలకలంబని సేయుమెట్లను ♦ నెమ్మిఁగాఁ దిరుఁగాడుచున్. ౯౮

చ. తమతమ నీడలాదరిని ♦ దప్పకచూచుచు సాటివారలం
చు మొగములంజిరాగుఁబలు ♦ జొప్పడఁగచ్చకు కాలుద్రవ్వన
ట్లు మననఁగాంచి ముద్దులుపో ♦ టుక్కునకాలను నేలరాయునా
గమనికవేరు చేడియలు ♦ గన్గొని చిర్నగునవ్విర త్రైజెన్. ౧౦౦

తే. గీ. తేటిమొత్తమ్ము బసవుచే ♦ నీటుఁదమ్మి
మొగడపై వ్రాలుమనఁదోచెఁ ♦ బిగువుఁగలుఁగు
బిత్తరియొకర్తె మగఁడు చ ♦ న్నొత్తులలిని
గనుపడియె కొమ్మవన్నె బం ♦ గారుబొమ్మ. ౧౦౧

తే. గీ. అసలుఁ బుట్టుఁగు మొగడపై ♦ పసఁజెలంగ
జమిలిముక్కాలి వ్రాలిన ♦ చందమెన్న
కొలఁకువలపు మిటారిమే ♦ ల్కులుకు గుబ్బ
దుగలగను పట్టుమొనలనఁ ♦ దోచెఁగనవె. ౧౦౨

చ. తొలకరిసూఁడు తెల్లనెద ♦ ద్రుక్కుచు మేలగుతమ్మితూండ్లకై
జలకములాన వ్రాలుచును ♦ సయ్యనలేచుచు సన్నపొల్పులీ
కొలఁకను తీఁగబోఁడికులు ♦ కుల్గల తెల్లని పూలబంతుల
ట్లలి చెరలాడెనో యనెఁడు ♦ మేరకనుంగొన వేనుడంతుకా. ౧౦౩

క. ఇట్టియొయారములనుఁ గని
పెట్టుచు పిననగవుతెగయ ♦ ప్రేముడిమదిలో
నట్టిపడ వెలఁదులందఱు
గట్టిన వెలిఁపట్టువలువ ♦ గమివిడచిమనర్. ౧౦౪

ఉ. సొమ్ములుఁ దీసిపెట్టిపడు ♦ చుల్మసచంమురు కావిఘట్టముల్
నెమ్మదిఁగట్టి రొమ్ములకు ♦ నిండుగ చీరెచెఱంగు సొంపులు
న్నమ్మతిలం బిగించి పలు ♦ మారును కాసెలబూసి దొండొరుల్
తమ్ములఁ బోలుకైనికయి ♦ దంటఁగబూనుచు నొక్కపెట్టునన్.

చ. తిరుగుచు నొడ్డుపైని తమ ♦ తీరఁగు నీడలనీటు నీటిలో
బరువడిఁజూచి చూచియు సె ♦ బాసని యారసఁబూని జిజ్ఞునన్
విరివిరిగల్లు తంతియల వీఁకను ♦ డిగ్గుచు సాటిరూపులున్
వెరఁగున మాయమానటుఁ గు ♦ భిల్లని మ్రోతలుఁ బుట్టదూఁకినన్.

ఉ. దూఁకినతోడనే చెలులు ♦ తొంటితెఱంగున మళ్ళిఁ దేలిమి
న్నాకను మేల మాడుచు జ ♦ వంబుననట్టిటు లీదువారు నీ
ర్వ్రెకిని లేచువారకుఁగుఁ ♦ బట్టగ మున్గెడువారు కొల్నుచీ
కాఁకుగ నింగినంట జల ♦ కంబులు జల్లెడువారు నీతొగన్. ౧౦౭

క. హాల్లాకొల్లారము జో
త్తిల్లఁగ చేడియలుఁ దూఁకఁ ♦ దిరిఁగికొలఁకు బె
గిల్లి ననుసరముఁ జెట్టకు
డుల్లోయని మొరలిడెనన ♦ నొప్పెర వాళుల్. ౧౦౮

ఆ. తమ్మికమ్మనీరుఁ ♦ ద్రావుటచే మన
కాఱుకురులసాటి ♦ గాంచెనంచు
తుమ్మెదలనుఁ జోపు ♦ తొగబడంతులుగుట
తానమాడుచుండ ♦ దరులఁ జేరె. ౧౦౯

క. పేరిమిరాయంచలు నొ
య్యారుల నడచక్కదనము ♦ హోయిఁగగని ప
ల్మారుమనను వారలుఁగని
కేరుదురని నింగిఁజేరి ♦ కినమునఁబడియెన్. ౧౧౦

చ. చెలువలమోము తామరల ♦ చెల్వముతో సరి రాక పోవుటే
బలిసిన తేంట్లుఁ దేనెఁగొనఁ ♦ బంటులమైతిమి వీటి బాయు పెం
పలరెదమంచు వీడిమఱి ♦ హాసులఁజూచిన వెల్తియయ్యె నే
లలఁబడుతీరు మేటియల ♦ లం డలమున్కలు ద్రావెనూఁగుచున్.

క. నీరున పొలఁతియొకతెయొ
య్యారమున న్మునిగికొంత ♦ హాదనున లేవన్
బేరమిసవ్వపు చెలులన్
జేరిచెలిమి సేయఁబోవు ♦ చెలువుగను పడెన్. ౧౧౨

క. బిత్తరమగు హాయున్మంజీ
ముత్తియముల చేర్లు వ్రేలు ♦ బుఱ్ఱటకొమ్మల్
బిత్తరులుఁదాల్చి యిరుఁదెస
లొత్తుఁగ నీరాఁడిరచట ♦ హాయలుఁ జెలంగన్. ౧౧౩

ఉ. కొట్టముచొప్పు నన్నెలఁది ♦ కూటువులెల్లనుఁగూడి నీరుచ
న్నొట్టులఁ దట్టనిల్చియెడ ♦ మేలని చిమ్మనఁ గ్రోవికేలునన్
బట్టివిసంబు బీర్చి గరు ♦ వంబును దొట్రిలచిమ్మతుంపరల్
బుట్టఁగనూది జల్లిరట ♦ మోములగుబ్బలపై దలిర్పఁగన్. ౧౧౪

చ. సరగున మోముచందురుని ♦ చాయలు కన్నులకిమ్మ జంటపై
బరివిన మోసమానసుచు ♦ బల్మరుమోమును మామకల్లటన్
విరివిఁగనీయ బూనెనన ♦ వేఁగనులం జెవులందుఃకంది బి
త్తరముగమూసి యొక్కచెలి ♦ తమ్మికొలంకున మున్గెఁగక్కునన్.

క. జలకంబులోన కొందరు
వెలికిలబడి నీదుచుండ ♦ పీఁకనుఁగాళ్ళన్
బలుమరు లేపఁగవేల్పుల
చెలువలపై కాలుద్రవ్వ ♦ చెలువుం దోచెన్. ౧౧౬

చ. వెలికిల నీటనీదగను ♦ వింతగ గుబ్బలుఁదమ్మి మొగ్గలం
చెలరుచు నంచకూటువలు ♦ హాయిదలిర్పగ రాగకల్కివే
దలకుచు జోరఁగిల్లఁబడ ♦ దారగుకావిరి కొప్పుగాంచి పిం
పలరెడుమ్రబ్బు లంచెడఁగ ♦ నర్మిలిఁబోవిడి బారెనద్దెసల్ .

సీ. ఏనుఁగు నడతో ర్త • మొగపుతనమ్ముల
తులఁదూఁగు తమ్ములఁ • దునిమివేసె
సంపెఁగి గందియు • నింపొందు కోదుమల
తుమ్మెక బారులఁ • ద్రుళ్లఁజేసె
దోరంపు జిగిమొగు • ల్తురుముగల్గిన నాతి
రాయంచలను బల్ప • గాకుపరచె
మామ మోమోర్తుక • మక్కువఁ బోనాడి
జక్కవపక్కుల • నుక్కఁచేసె
గి. నిత్తెరంగునఁ దిరుగుచు • చిత్తరముగ
తమ్మికంటులు తేటివి • తంపుకురుల
చెలువమిన్నలు నంచయా • నలునుజక్క
వదుగగుబ్బెతలీది ర • బ్రమ్మదోప. ౧౧౮

చ. కలుకుఁబ మోముదమ్ములను • కస్తురివన్నునుఁబూసి నీటిలో
వలఁగడుఁ దోఁగితామరల • బల్మిసచేతులఁబట్టి యొడ్డునం
దలరుచునేగుఁ దెంచిరియొ • యూనులు సంద్రపుఁగట్టుకై మునుం
గలిమినెలంత దమ్ములను • క్రైఁగవఁదాలిచి వచ్చుపోలికన్. ౧౧౯

క. అదిగో లెకమ్మఁ గాడుపు
లోదవినమై మెఱుఁగులీన • సువిదలమిన్నల్
ప్రిదులునసతీవె జొంపపు
చదురున పనిసేయు చలువ • చప్రముళోనన్. ౧౨౦

క. ఈహూపున చెలులందఱు
జేరినకుబ్జకును పనులుఁ • జేసెను చేడెల్
తోరంపు తొడువులును జ
ల్తారు చెఱఁగుచీరఁదెచ్చి • తాలిమిసంతన్. ౧౨౧

తే. గీ. తపసికన్యాపతేవను ♦ దారుమీరు
నిగ్గుఁగలకాఱు జొబ్బిలు ♦ నీటిచాగి
కప్పికురిసెడు వితముమొ ♦ గయునఁ జాల
తడికురులవెంట జలకము ♦ దవిలిఁజారె. ౧౨౨

తే. గీ. కారుమ్రబ్బును నెగ్గాడు ♦ కారుకురుల
నొక్కచెలివచ్చి తడియొత్తి ♦ చిక్కులెడల
దీసిమల్లియకడినూనె ♦ తిరుఁగఁబెట్టి
తొలుతఁదాల్చిన చంద్రకా ♦ వుల సడల్చి. ౧౨౩

క. జలుతారు చెఱఁగుపసజొ
బ్బిల తెల్లనిపట్టుచీరె ♦ పిడికెడుమేరం
గలకొనున బలుకుచ్చి
ళ్లలరఁగమైఁ దాల్పఁజేసి ♦ రతివలమన్నల్. ౧౨౪

తే. గీ. గుబ్బలుల మేటినిబ్బర ♦ మబ్బయనేఁడు
గబ్బిగుబ్బల జంటపై ♦ కారుజిలుఁగు
ముగ్గవనిఁజేసి కెంపులఁ ♦ బొసఁగఁగూర్చు
ఱైకచెలువారఁ చెలువ బి ♦ ఱానఁ దొడఁగె. ౧౨౫

సీ. చిన్నిచందురు మామ ♦ చెన్నగు మోమున
చేర్చుక్కఁ బొట్టొగి ♦ చిందులాడ
నెమ్మది చెవులకు ♦ కమ్మపొఱలనిగ్గు
చెక్కుటద్దంబుల ♦ చెమ్మఁగిలఁగ
నక్కన రతనాలుఁ ♦ జెక్కిన పతకముల్
వరఁగలించెడు బన్న ♦ సరులుగదుర
తెలివాయు మెకమునుఁ ♦ దెగడు మెల్లడుమున
బిల్లల మొలకట్టు ♦ బిగువు మెరయ

గీ. తళుకు చేకట్లు సందిటి ♦ తాయెతులును
కేలుదమ్ముల డాల్మిగ ♦ రాలముద్దు
టుంగరంబులు బదివేళ్ళ ♦ నొప్పఁ కాళ్ళ
గజ్జెలందెలు మట్టెలు ♦ గల్లుమనఁగ. ౧౨౬

తే. గీ. తొమ్మిదివితంబులునుఁ గల్గి ♦ తోరమైన
రవలఁగూరిచి పనిసేయ ♦ రంగుటెనుఁగు
ముక్కెరబులాకి నత్తును ♦ ముఱిపెమునను
నూవుఁబూఁబోలు ముక్కున ♦ దేవఁబెట్టి. ౧౨౭

క. ఈసొరున నాకుబ్జకు
కై సేసి యొయారులట్టి ♦ కారున తామ
ట్లానాటిఁ జెలఁగివారల
బోసనములుఁ దెసలఁబర్వ ♦ పొలతుఁలు పిలుచన్. ౧౨౮

ఉ. చీటికిమాటికి న్వలపు ♦ చెమ్మగిలందగు గాలివీవ పెం
దోఁటకురాళమందు వసఁ ♦ దొట్రిలు మేటికలున్నగద్దెపై
చీటక మొప్పఁగ వ్రవలఁజెక్కిన ♦ వన్నె పసిండిసింగపుం
బీటకుదిర్చి పైనిసరవింగడు ♦ గుబ్బపడంతి కూర్చొనెన్. ౧౨౯

క. మలపగతురాణి వేల్పుల
కలుకులుఁ గూర్చున్నకొలువు ♦ గమనికకుబ్జన్
గొలచియు గూర్చొనిరచ్చట
దలిరాకుం బోఁడులెల్ల ♦ దనుకులుఁ దొలఁగన్. ౧౩౦

మ. పిదపన్ గుబ్జపడంతి నివ్వెఱఁగునన్ ♦ బెంపొందు చీకాఁకు నె
ద్దఁదలిర్పం గ్ననవిల్తుఁడార్చుచును కో ♦ లంగూర్ప మంద్రాడమున్
గుదురై మేన్పొను కాడుదూపటిలి ♦ స్రుక్కం జెందియున్బట్టునుం
వదులంగన్నులవెంట నీర్వరదలై ♦ వారంగనొక్కుమ్మడిన్. ౧౩౧

క. ఇరుగడలనున్న సోబతు
గరితలగను రెప్పలార్ప ♦ కనుగన్గొని యీ
విరిహదనుఁ దోఁటలోఁ ద్రి
మ్మరఁగను వెఱవేఁకిబుట్టె ♦ మఱి నేమగునో. ౧౩౨

క. వలనాటుకొనెనుఁ గడునా
వలనా యాకాఁకనీరు ♦ వామినియీదన్
గలనా నాచేరువనుం
గలనాఁతుక మానికములుఁ ♦ గావరెనన్నుక్. ౧౩౩

క. అని తియ్యనిమాటాడన్
గను నేస్తపు చెలులలోనఁ ♦ గన్నాకగుప
ద్మిని నాఁబేరటిచేడియు
వినియూరకయున్న బిలిచి ♦ వివరించ నొగిన్. ౧౩౪

క. తలఁపున కలవరమెల్లం
దులదూఁగెను వెన్నపాల ♦ దొంగకు నాపై
చెలిమిఁ గలుఁగఁజేసియు నా
యిలుఁ జేరందోడితెమ్మ ♦ యేననుమాటల్. ౧౩౫

క. వినుమావిని వైళముగన్
జనుమాజని యల్లవాని ♦ సరిసంగడమున్
గనుమాగని నావేంద్రము
లనుమాయని తోడితెమ్మ ♦ యంకముఁ దొలఁగన్. ౧౩౬

చ. అని చెలియింక కొన్నిటి రొయి ♦ యూరికిఁ జెప్పినవీనులారఁగా
విని తనబుద్దిలోన బలు ♦ వింతలు సంతసముల్లసిల్లఁగఁ
దనవినినేయు మాటలవి ♦ తంబునకుం జిరునవ్వు చెక్కుఁ జం
టను హావళింప చక్కెరకు ♦ తావగుమాటలుఁ బల్కె వేడుకన్.

శా. అక్కావిన్ గనురెప్పపాటుఁ దరిలో ♦ నైబోవనుల్లాడెనీ
విక్కాఁ గల్గొనుకేల నమ్మమడి ♦ నిష్ఠే నేగి నీచైదముల్
నిక్కంబెంతటఁదీర్తు నమ్మికలతో ♦ నీవిల్లు చేరంగఁబో
దక్కింతుర్ గతివేల్పునీకు ననవి ♦ ల్దారింగ వాళింపుచున్. ౧౩౮

క. అక్కరొ యాతనిరవలం
జెక్కినమంచమున పూలఁ ♦ జేరుపఁదగు నీ
బ్రక్కవరుండఁగ బెట్టిన
చక్కెరవిలుతుండు ని ♦ న్గొసరి బానిసెయా. ౧౩౯

క. ననతీవెఁ బోఁడియా వై
వనియూరడిలంగ బలికి ♦ హాళియెసంగన్
దనుఁబోవ కట్టడంగొని
జనె గరుటామంతు కాతు ♦ చక్కనితలకున్. ౧౪౦

ఉ. నాఁవిని నేలతేమరము ♦ ణన్మది తామరవిప్పనిట్లనెన్
తీవమెఱుంగుఁ బోఁడిజన ♦ దేవెరి యేమననుండెనోయిటున్
బోవఁగఁదల్చెనో యటకుఁ ♦ బోయిన చేడియవచ్చుదాఁకసా
పూవులఁ దోఁటలోపలకు ♦ బూనెనొకన్నయమీది బాళిచే.

క. ఆకతలవితము లెల్లను
జోకలుఁ జెలువారఁజెవుల ♦ జొరఁగనునాకుం
వీఁకఁగొని తేటతెల్లమి
వాకుల వివరింపుమయ్య ♦ వదలని రాణన్ ౧౪౨

సుగంధీవృత్తము

కారుసీటి చాగిమంచు ♦ కార్వొరంగుచూపరీ
పోరుతిండి మిత్తిగొంగ ♦ ప్రొద్దుచాలిబమ్మలున్
సీరువామిఁజేరి కేలు ♦ నెత్తిఁజేర్చి మ్రొక్కఁగా
గారవించి ప్రోచుమేటి ♦ గట్టుఁదాల్పువేలుపా. ౧౪౩

మ. కుతిసీవీణము జిల్గురింగులనిగల్ ♦ గోరాడమూతాబి సా
ల్వతమింగప్పి పులుంగు తేని బుజలన్ ♦ లావొప్పగూర్పుండితే
క తెగన్ గావఁగముజ్జగంబులు వెలుం ♦ గన్నారి గావించు మే
లతనాల్గూర్చిన వేల్పుగొండ నెలవై ♦ రాణించు కార్వేలుపా.

( గద్యం )

ఇది శ్రీమద్రఘూంగనాంగ మందారలతోత్తుంగ స్తవ స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల రంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతం
బైన అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ద్వితీయా
శ్వాసము
శ్రీ





శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( తృతీయాశ్వాసము )

క. సిరిచాన మేనుతీవను
విరియు చన్నులపూలగుత్తి ♦ విడిమట్టుగు తే
టిరహి న్వేలువు గొండను
మరిగిన రక్కసులగొంగ ♦ మానిసి సింగా. ౧

వ. ఆలకింపుము. ౨

క. అనితపసి కఱ్ఱిమనుమం
డును బల్కినపల్కులకు పొ ♦ టుక్కున బుద్దిం
బొనుకాడెడు వారుసంబున
వినిచిన్నగు చెక్కులొత్త ♦ వినుపించె తగన్. ౩

తే. గీ. అటులఁబద్మిని నాచెలి ♦ యలరువిల్తు
డున్నపట్నముఁ జేరంగ ♦ తెన్నునడచె
నంతగాములఁ జేను త్తా ♦ వింతవేనుక
దెసనుఁగలకొండపైవ్రాలె ♦ తిరముగల్గి. ౪

ఉ. ఆ మనఁబోయినాక చెలి ♦ యూరెము నవ్వలవంతమీఱిరిపెన్
బాములనొందుచుండఁగ సె ♦ బానలి క్రొన్ననవిల్తు దొడ్డగా
నామనిచందమామ సుర ♦ లచ్చుటఁగొల్వఁగ గొల్వునుండిగా
రాముస బల్గిమందరకు ♦ గ్రమ్మన నేమనఁజేసె చెయ్వులన్. ౫

ఉ. చేసినతోడనే వెడలె ♦ చెంగవవిందును గాలిఁబూవటీన్
వేసిసిఁగుల్కనుంచి విరి ♦ విల్లునుగేలను దాల్చి వేటకా
వేసముఁబూని మ్రాకులను ♦ వింతగుమాటును బొంచిపొంచి సం
తోసమెలర్ప గన్గొనెను త్రో ♦ వను బెగ్గిలులేడికంటిఁదాన్. ౬

క. కనుగొని గోర్వంకల వే
గున కన్నియయూర మొప్పఁ ♦ గోగిలగమిజ
ట్టును ముట్టనిలిపి నేనా
మనిచాల్పుగనునిచి వేఁడ్క ♦ మదిఁజిల్కతొగన్. ౭

క. ఉసికొలిపి పిదపననవి
ల్లెనఁగఁగ పూవాలుఁగూర్చి ♦ యూరెముపాటుం
పసిఁగఁగొని చనులనడుమను
కసిదీరఁగ ములయనేసె ♦ కాంతాళముగన్. ౮

వ. ఇట్లేసిన కనలి యురువడించిన నబ్బలగంబును. ౯

చ. కనితలపోసి కొంతవడి ♦ కన్నులరెండిటనుండి వచ్చునీ
ర్చనుగవ కొప్రమందు బడి ♦ జారఁగకుందుచు గువ్వగుత్తికన్
వినుఁడు వెలందులార నన ♦ విల్తుఁడునున్నతిూపులేసె క్ర
న్ననపులుకాఁసి పుల్గులుక ♦ నారిలిబల్కులు బల్క వెండియున్.

ఉ. మ్రోసెను తేటిమొత్తములు ♦ ముజ్జగమందున తేజువెన్నెలం
గాసెను చందురుండు చలి ♦ కమ్మనిపమ్మెద తావిముల్కలన్
వేసెను గండుకోయిలలు ♦ పిన్నెసలెల్లను నిండు నెట్లుగా
కూసెని కేగ తిన్మగల ♦ కున్నదినోరుతు నేసేయుదున్. ౧౧

క. అనితనను దెప్పరములం
దనుసేసెకు తేటిరామ ♦ తమ్మనుగోర్వం
కనుతలిరు మెపరినినిం
పున సమతంబెట్టఁ దలచి ♦ పౌలఁతుక యనియెన్. ౧౨

ఉ. తేటివలంతులార పువుదేనియ ♦ లంగడుఁదాఁవి త్రావి మా
తోటిపసందు మీరఁబలుత్రోవలఁ ♦ బోవకనొక్క తీరుమో
మాటము లెంచియుండు డది ♦ మంచిది యిప్పుడు లేక పోయినన్
జాజెద మమ్మెదిర్చినను సంపెఁగి ♦ గందులమంచు మెప్పగన్.౧౩

చ. పరితములార మీకనుల ♦ బల్కినుకల్ గిలగొట్టుచుండనన్
సరమలఁబెట్టనేల నరు ♦ సంబున మామిడిమోకగుడ్చి చె
చ్చెర నొకకుత్తుకన్ గలసి ♦ చెల్మిని సేయక వాదులాడగన్
నరివడ దెట్టివారికిని ♦ చక్కగదిగ్గుడు లేమలెన్నఁగన్. ౧౪

చ. చదువుల పక్కులార మసఁజ ♦ క్కెర తేనియఁ బాలఁగ్రోలి బె
ట్టిద మెసలార మీమెఱవ ♦ డిన్వెసఁజూపుచు నుండనేల నే
నెద బెదురింతయైన గొన ♦ నేగుడు నివ్వెఱనొంద నాదులఁ
చదురులమంచు నిక్కెదరు ♦ చాలఁగనేర్పడె మీదునేర్పులున్.

గీ. కొమ్మగమి నెక్కి దిరిఁగాడి ♦ కొమ్మగముల
సరములనుఁ బెట్టనాయకూ ♦ నరవినెళవు
జెఱుచువార లటంచు నా ♦ నెఱికిఁదెలిసె
నరయజవ్వాది గందిన ♦ టంచుగనుడి. ౧౬

క. అనియెగ్గాడెడు తోయము
ననుగందపు కనుమయుందు ♦ ననుదిరువుచు చ
ల్లన కమ్మనగొని పర్యెర
తనమేనట గ్రందుకొనగఁ ♦ దరుముచ్చుఁ బలికెన్. ౧౭

క. మునువేల్పు టొడయఁడును నే
ర్పున నింతటివాఁడవనుచు ♦ బోసికనునిన్
దునుకలు మూఁటిని నాల్గిం
టినిఁ జేయుటవలనఁ జగము ♦ తివిగనుంజెన్. ౧౮

తే. గీ. క్రమము జవాదికడిని బు ♦ క్కాముదోఁడి
ముంపుచో నిన్ను నేమన్న ♦ బుద్దిని సఁ
సంబు గొనవికగాలిపి ♦ సాసియున్న
కైపుసామితనికమిక ♦ గాలిగీలి. ౧౯

తే. గీ. ఔర మును బొమ్మ నీదు పోం ♦ గారఁజూచి
యొకరికొక్కరుఁ గలువక ♦ నుండునటుల
మూలకును వేసెఁగావున ♦ ముజ్జగంబు
లలరె లేకున్నముంచెద ♦ రక్కటకట. ౨౦

తే. గీ. అంటగిట్టని వేల్పుతో ♦ నరయనేస్త
మాటవల్లను నిక్కువ ♦ మతనిగొనము
పై రనీకబ్బె నాబలా ♦ వతిపిరికిని
నట్టువనుమాటఁ బోనాడ ♦ నాయమేర. ౨౧

ఉ. చట్టనవీనుల న్వీనుము ♦ సారెకు సారెకు కన్నె నందులో
దిట్టరిన న్నెముం బునెము ♦ తీరు లెఱుంగను నేనుఁగట్టినన్
వట్టిదిగాదు నానుడువు ♦ వాలఁగునంచు దిట ముమ్మ నమ్మ నీ
బెట్టిదమేల కాఱులను ♦ బ్రేలెద చయ్యనకమ్మ కర్వలీ. ౨౨

మత్తకోకిలావృత్తము

రాకురాకు మటంచు నిన్నుప ♦ రాకుఁ జేయుచు వేడినన్
వీఁకగందపుతావి బూనియు ♦ వీచగానిది బాగె మ
నోక్కఁకుఁ గోరనుఁదీయుఁబోపని ♦ గొడ్డలింగొన నెందుకో
సోకుదయ్య మటంచుబల్కెడు ♦ జోలినిక్కువ మయ్యొరా. ౨౩

క. విను నిలుకడ గోరంతై
ననులేకయె దిర్వ్వలాడ ♦ నాయంబౌరా
పెనుసుళ్ల మునుఁగుదువు నర
యను కనుపడనట్టిబూతి ♦ మై పోదువురా. ౨౪

తే. గీ. ఎంత వేడినఁ గాని నీ ♦ కింతయైన
కనికరముఁ గల్గదాయె ని ♦ క్కముగ నీదు
క్రొవ్వ్వనఁగింతుఁ దెలియునే ♦ కొండవంటి
కటికపుంజనుగవగల్గు ♦ కన్నెకనుర. ౨౫

ఉ. గోరము లందజాలనిది ♦ గోకను స్రుక్కితి నూరకుండుమా
పైర బళీయదల్చకుము ♦ బాములు బాములబెట్టి నిన్నుక
డ్వారమెసంగుగాక చెలు ♦ వారెడు నీవడియొప్పు కారుపా
లౌరసరాసరిన్నెరయు ♦ నారడిఁబెట్టక మిన్నకుండురా. ౨౬

క. అనిచుటుల నాలిగాలిం
గినుకారఁగ దూఱి పైడి ♦ కీల్బొమ్మమసఁగ
గొని మరలఁదిరిగి బుద్దిని
కనికరమూరంగ పొగడ ♦ గాఁ జొచ్చె వెసఁగ. ౨౭

తే. గీ. పావగమితేని గెలిచియు ♦ పసిడికొండ
కొవ్వరము నీరువామిని ♦ కూలదియు
నట్టిమగటిమిఁ గలుఁగఁగ ♦ నలరిజగము
నిండుపయ్యెరతమి బెట్ట ♦ కుందు నన్ను. ౨౮

వ. అంత నమ్మగువ వగ నెగడ నెగులున నిగవునట్టువను బొగడుచున్న తోయంబున. ౨౯

క. చల్లని తెల్లని వెలుఁగుల
నుల్లసమాడగను కలువ ♦ నోడయుఁడు చదలన్

బల్లిదుఁడై తిరుగుచు వెద
జల్లెడు కాఁకలకు నదలి ♦ సయ్యనఁబలికెన్. ౩౦

తే. గీ. మున్ను తనయెంకిఁ గూలఁగ ♦ నిన్నుబుట్ట
జేసెఁజేసెను పోబొమ్మ ♦ చెనఁటినుంచ
తగదనుచు చంపకము నెల్ల ♦ తరుణమందు
బ్రతికియుండఁగఁ జేసె ♦ నెప్పటికి నకట. ౩౧

శా. బెట్రేకెత్తఁగ వేల్పుటొజ్జచెలువన్ ♦ వేఁగూడు దోసంబులు
న్నాత్రేనింగడు దయ్యమంచనక వీ ♦ కన్నెత్తి జేర్మాడుగుల్
దొట్రిల్లం జెలువంబు లూడినలుపెం ♦ తోఁబుట్టి నీ డెందమున్
జట్రాతిందగ నేయమేలగునె చా ♦ ల్చాలిట్టి సిగ్గించుమా. ౩౨

క. పులుఁగులు వేల్పులు నీపా
లుల వెసమొసవంగ తునుక ♦ లుం జేసిన నీ
కలిమి సెడి నీల్గవే మొఱో
తొలిఁజేసిన బాగెమునను ♦ దోడి బ్రతికితివా. ౩౩

తే. గీ. కన్నెమిన్నలనే చెడు ♦ కావలంబు
లంటగిట్టని వేలుపై ♦ యారనిప్పు
జేరికాల్చిన నలువయ్యె ♦ చెలఁగిపజలు
మట్టియుట్టను మాటలు ♦ వెట్టెఁగదుర. ౩౪

తే. గీ. కొసరుతో బుట్టువింటికిఁ ♦ గోడుఁగూర్చు
నటుల గోడును నాయెద ♦ నంటనేయ
చందమామనుమిప్పుడు ♦ చందమామ
తొగలవెత బాపినటుల నా ♦ తొగలఁబాపు. ౩౫

సీ. నిక్కమాదప్పదు ♦ నీయెదమసఁగాను
నినునింగి సిగబట్టి ♦ నేలఁజరువ

నిన్ను పక్కలగబి ♦ నెఱినెఱితిని పోను
నీపాలు లింతింత ♦ నిచ్చెతరుఁగ
చవితినిన్గను పజ ♦ సంతుల పాల్గాను
పరఁగవున్నములందు ♦ పాముగరుప
నీమేనయల్లుని నీటుమై ♦ గాలిపోన్
నిన్గన్న కడ్పుబ్టె ♦ నీరుగాను

గీ. ఓరియొజ్జలరాణితోఁ ♦ జేరిమరుని
పోరుఁదీర్చిన నడిదోన ♦ కారి నిన్ను
నంటకావల మెల్లను ♦ నంటుగాన
నేను తలవంచెదను జూడ ♦ నిన్నుమామ. ౩౬

క. అంచీవరుసున కినుకన్
మించగఁ బోనాఁడితాలి ♦ మింగుండియలో
కొంచెముఁ బూనియు పొగడెద
మంచి నుడువుగమిని నంచు ♦ మడఁతి గుసుపుఁగన్. ౩౭

ఉ. ముమ్మొనవాలుదారి తల ♦ బొల్పగు బంగరుమేటి కుళ్లవై
తంమ్ములగొంగవై కలువదాటుల ♦ పెన్వగ బాపుచుండివిన్
దిమ్మరులున్నబానసఁగ ♦ దిర్వుచు ముజ్జగముల్వెలుంగు దో
మమ్మతిలంగ గాచియును ♦ మమ్ముల ద్రిమ్మట బెట్టకుండుమా.

క. అనిఁబొగడు చుండుతఱిలో
ననవిల్తుఁడు కేరివింట ♦ ననలల కోరుల్
బెనువడఁగూరిచి చెలియ
కుక్కనకును కను ♦ జూపులలరఁ గొనకొని వేయన్. ౩౮

ఉ. వేసిన వేలుతోడ వెర ♦ వేఁకియెడం గడుబుట్టుచుండ తా
గాసిలి యొక్క చేడె చనుఁ ♦ గట్టులపట్టు నవేఁ బరుండి సె

బాసుర తొల్లి కాటిదొర ♦ షాలిట నీజవ యేడఁదాగె ని
ట్లీసుల ముద్దరాలివయి ♦ నేయఁగ నాయుమయించువిల్తుఁడా. ౮౦

తే. గీ. నీలకొరులవలపులు ♦ నిలువలేక
బమ్మకతె వేల్పు కాఁ బ్రేకు ♦ తిమ్మగలుఁగ
నోటయెద మేన తమతమ ♦ జోటిరతన
ములనుదాల్చిరి మే మెంత ♦ షోటుకాఁడ. ౮౧

చ. దుగినుడు నీదు బెట్టిదపు ♦ త్రోవలుఁ బోకడఁజూచి యోటి నా
లుగవిఘు పూవులైన యెద ♦ లోబడకన్ గరువంబెసంగఁగా
నెగులు కొనంగఁ జేసితివి ♦ నీకవిగాటపు తూపులిచ్చినన్
జగములఁగాల్చవే వలపు ♦ సామిసతంబు తలంపునేసినన్. ౮౨

క. ఓరీ నీవలెబంటులు
లేరో నీవాకడవాకొ్క ♦ లేకున్నను విల్
దారిలి యిటు మిడిసిపడకె
మేరటరా చెలుల నా యు ♦ మేరానేచకె. ౮౩

ఉ. నెయ్యపుతేఁడ నీకు జత ♦ నెవ్వరి షోటరికాఁడు లేడటం
చొయ్యన బెట్టిదంబుఁగొన ♦ నోర్తురె పెద్దలు నేరికైన మేల్
చెయ్యఁగ మంచిదంచు మఱి ♦ జెప్పిరి వెన్నఁటిమామఁగూడి యీ
కయ్యముఁ జేయవచ్చెదవు ♦ గాయిలుఁజేరగబొమ్మ జట్రునన్. ౮౪

చ. చిలుకహాుమాయి ♦ చక్కెరల సింగిడి తేటులనారి కమ్మపు
వ్వులు ములుకుల్దలంపగను ♦ పూదఱి కమ్మనిగాలి నిండు వె
న్నెలదొర వెంబడింపవల ♦ నెయ్యుడ నీయెడగూడి తుల్వలై
కలువరమందఁజేసిరి వ ♦ కావకలుంగలుగంగ నిత్తరిన్. ౮౫

సీ. అక్కున తెల్లని ♦ యలరు సోగులుఁగావు
సారది సప్పంబుల ♦ సోగులివిర

నాదుజడఁజూపి నీమోము ♦ నక్కు నీ ద
దాయఁడగు గాలి వినుఁజేరు ♦ నాచనుఁగన. ౯౦

క. ఎన్నన్నొ నుడివినను నీ
కున్నన రెక నేలబుట్టు ♦ కుంకు టదేమో
కన్నను దట్టినఁ దప్పదు
వన్నియ నీమేను పేరు ♦ వలె నారోరీ. ౯౧

వ. అని యిట్లు కినుకతోఁ దూతి యక్కటికమూని చొక్కపుమాటల
నక్కాణించుచు నిట్లనియె. ౯౨

క. జగముఁ గలిగించు బొమ్మకు
నొగి తమ్ముఁడవయ్యు నల్ల ♦ యొడలిదొరకు మే
లగు కొడుకవయ్యు నీ వు
జ్జగముల వలవంతఁ జేయు ♦ జాణవుఁగదరా. ౯౩

తే. గీ. అన్నిటుల బొగడిసఁ గాని ♦ యంతకంత
కలరి వలపులరాయఁడు ♦ కలువతేఁడు
కాఁకులనుఁ బెట్ట వెఱఁగంది ♦ కనికరమున
చెంతనుండెడి నేస్తపు ♦ చెలికి ననియె. ౯౪

ఉ. వాలుగడాలు ఘాకకును ♦ వాలెపు నాదిడు తేటి మూకకున్
వేలుపు బువ్వకాఁకకును ♦ పీవలిరాకకు సారె రేకకున్
బూఁబిడారు జోకకును ♦ పొల్పుఁగు జిల్కల నొకుకూకకుం
దోలిమించి కాఁక తులఁదూఁగెను నే నెటులోర్తు నే యిటన్.

క. హెచ్చరికఁ గాలి వీచెను
నచ్చలమున మరుఁడు నేచె ♦ నాకసమున చం
దెచ్చి చెలరేఁగె గాము
చ్చిచ్చొగినిటుఁ గూడెనేమి ♦ సేయుదు చెలువా. ౯౬

వ. ఇట్లు మతకరివేల్పుఁగూఁకు తన కనుంగవకుఁ దోఁచి మఱియు చెలువ
కిట్లనియె. ౫౭

క. నిక్కె చనుగంటలుబ్బ ప
టక్కున లలితైకపికిలె ♦ రవరవరింగుల్
స్రుక్కనల కొప్పుఁజారెను
గ్రక్కసమున పోకముడి బి ♦ రానను వీడెన్. ౫౮

ఆ. వె. అనుచు కల్కియుల్కి ♦ వినఁబల్కె చెలికి తా
తావిపూవులలరు ♦ తీవెయింట
పట్టుపాన్పుపైన ♦ పట్టుదప్పిన కీలు
బొమ్మవగిది వ్రాలె ♦ పొంకముడిగి. ౫౯

ఉ. వ్రాలినతోడనే చెలులు ♦ వారని ప్రేముడి మేరటిల్లఁగా
వూఁ నురంటి వీచుచును ♦ పువ్వులు కస్తురి కప్పురంబు మే
ల్గాఁపిలు జవాదిమైనలఁది ♦ క్రన్నన కొంతనుఁ బోవఁజేయు మేల్
నీలిసిగల్ మసన్వలప ♦ నింగడుసేసిన కుబ్జచేడియున్. ౬౦

క. కనుగవ విప్పుచు నల్గడ
లనుగన్గొని మైవడంక ♦ లంపటమున మో
మున చెమట చెమ్మరింపఁగ
దనసకులనుఁ జీరి మఱి వి ♦ తాకునుఁ జెందెన్. ౬౧

వ. జెందిన నమ్మలక్కలొక్క చక్కటి కేతెంచి చిక్కుబడియున్న యక్కొమ్మం జూచి చెక్కుచెదరి యొక్కరొక్క రొక్కరొక్కరి మొగంబులం జూచుచున్నంత నొక్క టక్కులాడి యక్కలికి గ్రక్కతిల్లి మొక్కచెడిన తోడిజోటులతో నామాట పాటించు డని యిట్లనియె. ౬౨

ఆ. వె. అలమటించనేల ♦ యతివలు వినుడీ యీ
చెలువ చెలువ మలరు లలరుఁదోఁట

లోఁన ద్రిమ్మరిల్లఁ ♦ గా నింతఁగల్గెహో
దీని కేమి వితము ♦ తెలియఁగలరో. ౮౩

వ. అనిన నొక్క మచ్చకంటి నెచ్చెలులతో నిట్లనియె. ౮౪

క. ఓసకియలార యడవిపి
సాసి చెలియమేను సోకె ♦ సరికన్నయ్యన్
వేసదివి బొట్టుఁ బెట్టిన
నాఁ సరియన నిచ్చపడిరి ♦ నాతిరతనముల్. ౮౫

వ. ఈతీరునఁ బొట్టుఁబెట్టి తెలివిడిసేసిన తేవకున్న నొక్కచాన జాణ
గాన జాణలగు లతకూనల కందఱి కిట్లనియె. ౮౬.

క. పుం డొకటి యున్న మం దొక
టిండాలుగఁ బెట్టినన్న ♦ తేవను నవలా
కుండు వెతఁ దొకటి మన మిట
నిండారఁగఁజేయు టొకటి ♦ నీతకములచే. ౮౭

ఉ. హెగ్గడికత్తె లప్డు వల ♦ పెచ్చిన కుబ్జనుఁ జూచి జంకునన్
దిగ్గనలేచి మంతనము ♦ తెల్విడికై మఱి తేవనెత్తుచున్
బిగ్గఁగ కౌఁగిలించి విరి ♦ వింగల చెక్కులచేత నంటి నీ
యొగ్గతమాడువక్కణము ♦ లేమొయొకూరియొకూర మొప్పఁగన్.

తే. గీ. తెలుపు దెలిపిన నీవగ ♦ దీరునమ్మ
దలఁచియుండిన దాని చే ♦ తనుఁ గలుఁగు
నమ్మ లోలోన కుముల నా ♦ యమ్మ కొమ్మ
కతనుఁ జెప్పుము వన్నెబం ♦ గారుబొమ్మ. ౮౯

తే. గీ. పసిఁడికిని సరదుఁగలమేయి ♦ వసలుఁ జారె
పసితనంబున కెదలోన విసుకుఁ గదిరె
తొగలవిందును బోలిన ♦ మొగమువాడె
తొగలనొందకఁ జెప్పుమో ♦ తొగలకంటి. ౯౦

సీ. దొండకెమ్మోవి నీ ♦ దండకు చిలుకలు
జేర మేల్చదువులఁ ♦ జెప్పవేల
నలుప్రబ్బు కీల్గంటు ♦ నమిలి పులుంగుల
జేరి చిందులుద్రొక్క ♦ జెప్పవేల
యసలుపుట్టుఁగుకంటి ♦ వెస తెలిపిట్టల
జేరి మేల్నుడుకలఁ ♦ జెప్పవేల
చిగురాకుబోడి నె ♦ చ్చెలిమి కోగిలగుంపు
జేరి మేల్పొరములఁ ♦ జెప్పవేల

గీ. విరియఁబారిన విరజాది ♦ విరుల పొగడ
పొన్న గేదఁగిమల్లియు ♦ మొల్ల జిలుఁగు
గన్నెరులపూల సోగుల ♦ కారుకారు
మొగుల కీడఁగు కీల్జడ ♦ ముడువవేల. ౬౧

సీ. రంగుమేలిమి మేన ♦ బంగరుసొమ్ములు
బెట్టుక నీ విట ♦ బెదరనేల
చిన్నిమొగంబున ♦ వన్నెకస్తురిఁబొట్టు
దిద్దక నీ విట్లు ♦ త్రిక్కుటేల
కుతుకసారంబున ♦ కుతికెలఁ బడవీనె
సారెలగీటవు ♦ సరముదేల
తియ్యన కమ్మనఁ ♦ దేరిన నుడువుల
మాతోడ నుడువక ♦ మసలనేల

గీ. గందమును వచ్చకప్పర ♦ మందముగను
చేయ దమ్ములు నక్కున ♦ జేర్పవేల
లేచి పూపొదరిండ్లలో ♦ లేమ తొగల
మేలుగా గూడి నడువవి ♦ దేలఁ గోల. ౬౨

ఉ. ఓరుచు కొమ్మగోడు లెద ♦ నొయ్యన పూవులమాలె లక్కనన్
చేరుచు కొమ్మలో దలఁపు ♦ చెల్వఁపుచేడెల కెల్లఁ దెల్పెడిన్
దారిచి పూలవిల్తునకు ♦ దక్కువకారులఁ జెప్పి నిల్పఁగా
నేరుపు జాలకున్న విను ♦ నెవ్వగలు న్మది నుండునో చెలీ. ౯౩

క. ఇటువంటి గుట్టు లున్నను
కటకట మాతోడఁ జెప్ప ♦ కను నీ విపుడె
చ్చటనైన నుండుదానవొ
తటకున వివరింపవమ్మ ♦ తళుకులబొమ్మా. ౯౪

తే. గీ. అనిన తా విని తలవంచు ♦ కొని యొయారి
కాలు చిటికెనవేల్ గోర ♦ నేల వ్రాయు
చును కనుఁగవను కన్నీరు ♦ చనులదంట
కొప్పరంబులఁ బడఁగ వా ♦ కొనె ముదుంగు. ౯౫

ఉ. చక్కెరవింటివాని పెలుచ ♦ న్గెలువన్ దగు గట్టుఁ దాల్పరిన్
జొక్కులుమీరునట్టి నుడి ♦ చొప్పులుఁ జెప్పి బిరాన వాని నా
చక్కికి వచ్చునట్లుఁ గను ♦ సయ్యన జేసెదనంచు నేగిరా
[illegible]క్కను తుంటవిల్తు బలు ♦ దాడికి నుందితి నెట్టులో చెలీ. ౯౬

తే. గీ. అందలేనట్టి మ్రానుపం ♦ డందబోవు
మాడ్కి కలుముల పడఁతికి ♦ మగఁడనంగ
వెలయు ముప్పొకలానినే ♦ విరిలకోరు
కాని పోరున గవయఁగఁ ♦ బూనుకొంటి. ౯౭

తే. గీ. ఎవరు నాకోర్కి దీర్ప మ ♦ తేఁగగలరు
ఎవరివేడుదు నిచ్చట ♦ నేలికైన
చెలిమి చేడియ మిన్నగు ♦ చెలువ పద్మ
నియిటఁ గలిఁగిన నాకును నెమ్మి పొసఁగు. ౯౮

వ. ఇట్లు నెచ్చెలియలతో కుబ్జ వాకొనుచున్నంత కలికి కొనంబులు గలుఁగు చంద్రముఖి యను మెలఁత యిట్లనియె. ౯౯

ఉ. సాటివలంతులీ వలపు ♦ సాగిన బెంగను బెట్టు కొండు రే
తోఁటను ద్రిమ్మరిల్లుతరి ♦ తొందరలుం బహువారలుండు రే
మాటికి మాటికిన్మరుని ♦ మామనుపుల్గులఁ గాడ్పుఁజూచి యా
రాటము డెందమందిడప ♦ రాకిది గల్గకఁ బోవుపెట్టులన్. ౧౦౦

శా. ఔనే యెంతలుఁ దెచ్చుకొంటివిక నా ♦ హా యేమనన్వచ్చు నీ
కీనేలన్ జతయైన జవ్వనులు తే ♦ రే వారలీ వింతలా
వైనంబు న్వెసవిన్న నవ్వెదరు తే ♦ వన్వేగిరంబుం గొనన్
గానాయంబునుఁగాదు నూఁగొనుమా ♦ కన్నయ్యతో తెంచెదున్.

ఆ. వె. అనుచు వలపుమీరు ♦ నతివెకు మేలైన
నుడులు కొన్నినుడివి ♦ యుడుకు దొలఁగ
జేసి మెలఁగించుట ♦ చెలఁగి కన్నయ్యకై
తరలిబోవు నవల ♦ తారుఁదాక. ౧౦౨

వ. నట్లు ముగుదలు వినిపించిన పూఁదోటలో కన్నయ్యవలపులం బడి దిరుగుచుండె. నచ్చోట దేవకికొడుకు కుబ్జ మువ్వంక లెగయఁజేసి కమ్మచ్చు పోసినబంగారు తీఁగమాద్రి నలరారు కన్నెక నెగాడగ కన్నుల పండుగుగాకనుం గొనునది మొదలు జగము తండిరడెందంబు తామరపాకున జలకంబు లాకునంటక చెదరాడువగ కమ్మవిలుకాని పువ్వుటమ్ములకు సొమ్మసిల్లి యుల్లంబు తల్లడిల్ల నన్నతోనున్న సకులతో రాచదారిం బోయిపోయి విలుగీముఁదరి యంజొచ్చి సురతాణివింటికై వడి పెద్దదియై బీరముఁగల మగలకు దాల్పుటకు వ్రేఁకమై యలరారుచున్న సింగాణికి యచ్చటిపజలు వలదువలదనంగ నారిమోపెట్టి ఖణిల్ ఖణిల్ మనునాదు నలుదెసలఁ చెలరేగ రెండుగండ్రికలుఁ గావించె. అత్తుండంబు లన్నదమ్మ

లుచేగొని నచ్చోటి కాపరిపజలు పజీరులు గరువించి చుట్టుముట్టిన మట్టుఁబెట్టి రాచకొలువునకు జనుచుండఁ ద్రోవ కువలయాపీత మను నేనుంగును యశోదకుఱ్ఱనిఁ బరిమార్చుటకై నిలువ నయ్యాదిమస్తి గలిగి మావంతునంకియకు నిలిచె నంతకుమును మ కనకతప్పెట గుమ్మటకై ముడి నగరతుడును మొనలగు చప్పుడులచే మ్రోగు చుండునదియు చాణూరుఁడును ముష్టికుండు నరిష్టుఁడు మొదలు మల్లడించెడుకొలంబుచేతఁ దీండ్రించునదియును కప్పురపుఁబునుఁగు జవ్వాదిమలాక పూనీరుకలిపి దుమారము లేవకుండునట్లు చేసి నదియు బొడిపిరాళ్లు వయ్యాలు మిఱ్ఱుపల్లంబులు పుట్టుగొలె లే కుండునట్లు కోమలికంబుగా నుంచినదియు పడగజెండాలు పువ్వుల మాలెలతో బురణింపనేసినదియు నేలవేలుపులు రాచలు కోమ టులు నాలవకొలంబువారు నన్నకొలంబుల వారితో మ్రోగు చున్న నొంటియుడుగు కత్తెరనేలకుం వెన్నుండన్నతో నరుఁగు చుండ రాచమిత్తులు పురికొల్ప మదపుటేనుఁగు బరికొని యానచే నెదురించిన వెన్నుం డిట్లనియె. ౧౦౩

తే. గీ. ఓరియేనుఁగు గాచెడు ♦ కారుచదుగ
మాఁదెసకు నేగుదెంచుట ♦ మంచిదిటర
మరలఁగాజేసి బ్రతుకుము ♦ మరలవేని
తప్పదిక చావునీకు పె ♦ త్తనముచేత. ౧౦౪

చ. అనవిని మావటీఁడు మురు ♦ వారఁగమీఁదికి ద్రోలినం గనుం
గొని మొలహొన్నుకాసెనల ♦ కొప్పును బిగ్గఁగఁజేర్చి వెన్నుఁడున్
గనలుచు తొండమందినడి ♦ కారము నొప్పపజల్ విసంగనం
దుపిమొగ పల్లవన్ బెరికి ♦ తోడ్పడువాపు బలారెయుంచననన్. ౧౦౫

వ. ఇట్లు గజ్జెనుఁగునుం బరిమార్చి దాని నిడుదలై తెల్లనై యలరారు రెండుపళ్లను బెరికి చేపట్టి రాముండును కృష్ణుండును మావటిని

బీరముఁగల పజలను రాచవారిదండును మట్టుబెట్టి వచ్చుచుండ తోటిరాచ లిరుప్రక్కలం గూరుచుండి పలువితంబుల మాటలాడు చుండనొక్క పెద్దమంచెయుంచలి తళతళమను మాతాబిఁగూర్చిన పట్టుతివాసి యంచుపైన జిల్లేడదూది చేసుఖు మాఁకులుదిండ్ల యెత్తుగా మెత్తదలకై నతికించిన దానియందు బసచేసి మంతిరిగమి పుడమిఁజేను లొనరించిన తప్పొప్పులెల్లఁ జెప్పి నాటికితగిన మంచి చెడ్డలు వినుపించుచుండ నందు ముష్టికుండరిష్టుండను చాణూరుఁడు మొదలగువారున్న యెడ మనువు పరుపు నేలను కుప్పించి పెనువెల్లి తరిని ముజ్జగంబుల చెందు చెండాడనిలిచిన మిత్తిమిత్తి గొంకల తెరఁగున సచ్చళింత సేయుచు తాటికి నెత్తువచ్చు గూప్పులతో నెత్తు రుఁగ్రక్కఁగను గవలతో నన్నల నడ్డపాటులేకుండ పచేరంబుసేయు చున్నవారిం దరియం జొచ్చి గట్టు గట్టుపోటీగ కోల్పులి కోల్పుల మాఁపరి యేనుఁగు నేనుంగు చందంబున సింగంబు సింగంబుతీరు రెట్ట బలిమిగల బలిమికాండ్రఁబట్టి మిట్టిపడుట పట్టుదలయేయని కేలున కేలుఁగీలించి కాలుకాళులం జొనిపి పడదిగిచి పేర్చియూర్చిన సయ్యో ద్దరు గ్రద్దనపిరుతివక పిడికిటి బొడుపులకున్ జెదరని యెడదగలిఁగి యొరసారించి తెరలక మరల పోరలఁద్రొచ్చిన వెన్నుండు తనయే నుఁగు తొండంబులబోలు కేలుదంటసాచి మగరాలవలె కటికితనం బుగలదాయ నొడలి పిడికిట విడువక పొడుచుచు నడుగులం బట్టి నాయంబు నిప్పక నడుగిడుచు నడుగులం బట్టి మున్నూర్మరుఁ ద్రిప్పి నేలపై జరిచిన మోములనుండి నెత్తురుల గ్రక్కుచు జేజెల పట్టుం జేరం జనిరి. నత్తం రోహిణికొడుకు నట్లే యొనర్చిన జగంబులెల్ల గొనియాడ నందుడు మొదలు కొలువువారందఱు కంసుని సరసనఁ గూరుచొని నూచుచుండిరి తరువాత నిదురించి యూ కటికి లేచి కొండసారంగంబు పీడిన సింగంబు చందంబున కటిపజలను తెగ

టార్చి కన్నయ్య సింగంపుపీటపై మల్లులు తనను కారియబెట్టక
నికరంబువదలి చూచుచున్న కంసునిగాంచి కుబ్బబ్బా యీడుద్ద
గీడు నా కొరకు నా తల్లితండ్రుల కారంజేర్చి రాచలచ్చిమి పెను
బ్రేఁకను దాల్చుటకై తండిరియగు నుగ్రసేనుని చెరసాలనుండి
తన యిచ్చతీసునట్లు దిరిఁగెనని దాపుంజేరి బొమిడికంబుపై కేలు
దమ్మిఁ జేర్చితిగిచిదలవెంట్రుకలంబట్టి నేలకీడ్చిన వాడంతకు
ముందె కన్నయ్య రూపునుగాంచినంత చిత్తవలెదోచి మోము
డంబుఁబువప్పి తేజులేకనుండె నతని ముట్టినంతనె నసువులవీడి
వినువీడు సుగంబు జూడంబోయె గాని తమ్ములును జరాసంధుడు
పల్గాకి పజల నైదుకొని కాలయవనుడను తురుక యేతెంచి
ముట్టడించిన కయ్యంబున తీసుపాటుగావించి మధురనువదలి సంద
రఁబులో ద్వారకయను పేరిటితో రాచనగరు గావించి నందు
సుగంబున్డై భోజకొలంబునకు పులియగు నుగ్రసేనునికి మరలి
రాచలచ్చిమిని కట్టించె తన తల్లిదండ్రుల చెరవిడిపించి సుగం
బుండ నొక్కవాడంతిపురిని మెత్తని సెజ్జపై బరుండి కుబ్జ చేడియ
కనుదమ్ములఁ గట్టినట్లైన కన్నయ్య. ౧౦౬

సీ. క్రొల్గంటి మేటి సిం ♦ గారంబు దలపోయు
జవరాలు రూపు న ♦ చ్చముగ నిలుపు
చిలుకలకొల్కి మ ♦ చ్చిగ మాటలో నెన్ను
కన్నియ కోమలి ♦ కము దలంచు
తెలిగంటి వగటు నా ♦ ద్దికతోడఁ దూఁకొను
కప్పురగంది చ ♦ క్కదనమెంచు
వలఁతి మేన్వలపుల ♦ వరుసనుఁ గొనియాడు
సోఁగకన్నుల మది సొక్కుదలఁచి

గీ. మగువ తిన్నని మోము తా ♦ మరఁ మిటార
మునకు మెచ్చును మాటలు ♦ పొంతనమున
కెడద సంతోసమందు వి ♦ దేర్పడంగ
లచ్చి మొగడిట్లు తలఁపు త ♦ లంచియుండె. ౧౦౭

క. తొలఁగున్నడబకు బెచ్చె
మొలఁగున్నడు చందిరికను ♦ మేల్ మేలనుచున్
కలగున్మరుని తలంపున
కలగు న్మేన్పడక జేర్చి ♦ యలసట నొందున్. ౧౦౮

వ. చెఱుకువిల్తుండొఱ బెటికి గఱకటిగాక కఱుకు మెఱుఁగు గొరకల కఱఁద దూరనాటినఁ బనచెడి దనయింటి చేరువకుఁ వేరువడక సారువలుఁగల పూఁదోఁటలో సారెసారెకు దిరిగాఁడు మరుని వారువముల పారువముల గొరువంకలతో రాగిల్లు పూవులకోవుల మావుల తీవియలనుఁ జూచి కళవళింపుచు నొక రాయబారి నంపుటకు తలంపుసేయు నంతలో కుబ్జవెలందితో యానన్నొంది యేతెంచిన పద్మిని రాణివానంబున కానంతైన కన్నయ్య జాడ లెరుంగక తోడి ప్రోడలకు వీడియంబులొసంగి పోడిమిగల వేకు కల నాడుచు తెరువెఱంగె. ౧౦౯

తే. గీ. అంత పద్మిని నాచెలి ♦ యలరువిల్తు
తండ్రికడ కేగుదెంచి వి ♦ తాకునొందు
చెలువ వక్కాణమంతయుఁ ♦ జెప్పుటకును
కేలుమోడిచి యిట్లు న ♦ గ్గించె బగిది. ౧౧౦

(కందగీత గర్భ చంపకమాలా వృత్తము)

కడు॥ కటివేలుపా। గవురు। కన్నఱ। కానలగాలిమి త్తన
ల్లడ। దవురా। మసన్మొగులు గచ్చునికామొయి మురువ్వకాడప్రే।

ముడి। నెఱితో। నెపందలఁతు। ముప్పరిపోకలతారువాడపాల్।
కడలి బసా। జగా గానము। గైకొని బ్రోవుము కోర్కె లూరఁగన్॥

క. కఱివేలుపాగవుసుక
న్నఆకానల గాలిమిత్త ♦ నల్గడసవురా
నెఱితో నెపం దలఁతు ము
ప్పఱిపోకల తారువాడ ♦ పాల్కడలి బసా. ౧౧౨

గీ. గవుసుకన్నఆ కానల ♦ గాలిమిత్త
మొగులు గచ్చువి కౌమె యి ♦ ముర్వకాడ
దలఁతు ముప్పరిపోకల ♦ తారువాడ
గానము గైకొని బ్రోవుము ♦ కోర్కె లూర. ౧౧౩

(చతుర్విధకందగర్భ సమితాక్షరవృత్తము)
నెలప్రొద్దుకన్నుఁగవ ♦ నిగ్గులమై
కొలమ్రుబ్బుపైరగురి ♦ గొట్టెలమిన్
గలనీరు వామియిలు ♦ గల్గు లలీ
నలవేల్పనే గొలుతు ♦ నాకలిమిన్. ౧౧౪

(ఇందు ప్రతిచరణమాదిగా చతుర్విధకందములు జనించు)

గ. ప్ర. కం. నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రుబ్బుపైర ♦ గుఱిగొట్టెలమిన్
గలనీరు వామియిలు గ
ల్గు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్. ౧౧౫

గ. ద్వి. కం. కొలమ్రుబ్బు పైరగురి గొ
ట్టెలమింగలనీరు వామి ♦ యిలుగల్గు లలీ
నలవేల్పనే దలఁతు నా
కలిమిన్నెల ప్రొద్దుకన్నుఁ ♦ గవ నిగ్గులమై. ౧౧౬

గ. తృ. కం. గలనీరు వామియిలుగ
ల్గు లలీనలవేల్పనే గో ♦ లుతు నాకలిమిన్
నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలమ్రబ్బు పైర ♦ గురిగొట్టెలమిన్. ౧౧౭

గ. చ. కం. నలవేల్పనే గోలుతు నా
కలిమిన్నెల ప్రొద్దు కన్నుఁ ♦ గవ నిగ్గులమై
కొలమ్రబ్బు పైర గురిగొ
ట్టెలమింగల నీరువామి ♦ యిలు గల్గులలీ. ౧౧౮

(చతుర్విధకందం)

గ, ప్ర. కం. వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి ♦ వాడిమి నెసగన్
బెరసుపజజదిపి యెలమిని
విరివిని నసిబుడమి కిచ్చి ♦ వెలఁగితివి సరిన్. ౧౧౯

గ. ద్వి. కం రుసిగమిని బ్రోచి వాడిమి
నెసఁగన్ బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్
నసిఁ బుడమి కిచ్చి వెలఁగితి
విసరిన్ వరుస మనిచితివి ♦ వెసదేవరలన్. ౧౨౦

గ. తృ. కం. బెరసు పజజదిపి యెలమిని
విరివిని నసిబుడమి కిచ్చి ♦ వెలఁగితి విసరిన్
వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి వాడిమి నెసఁగన్. ౧౨౧

గ. చ. కం. నసిబుడమి కిచ్చి వెలగితి
విసరిన్ వరుసమనిచితివి ♦ వెసదేవరలన్
రుసిగమిని బ్రోచి వాడిమి
నెసగను బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్. ౧౨౨

(మత్స్యబంధము, భద్రికావృత్తము)

రార కన్నయ మాటిమాటీ
కోరిఁ జేరితిని మేరగా
గారవించి కొలఁద్రోలఁగా
మేరయూరయెద నెంతురా. ౧౨౩

(ఖడ్గబంధం, సుగంధివృత్తము)

ఏటిబోటి మేటిలోన ♦ నిక్కినిక్కి చక్కఁగా
గాటమైన నీటిబండు ♦ గట్టుదారి యేలికా
కాటిఱేడుబమ్మఁ గొల్వ ♦ కల్ము లిచ్చి బ్రోవఁగా
గాట మిచ్చు నీటిచాగి ♦ కాహళారంగుమైచోకా. ౧౨౪

(మర్దళబంధము, మావకణవృత్తము)

మేలుగడించుదు సాలున్
గ్రాలగ పక్కిమామాయిన్
మేలుగ నెక్కి మాసారిన్
చాలగ బ్రోచెదుమా-రా. ౧౨౫

(కూర్మబంధము జలదవృత్తము)

కారడి మేల్ మెఱుంగు మెయి ♦ కన్నయ సిం
గారపు హొంన్నకోక పర ♦ గన్వొనుకన్
దారవెదాయల న్మెదుప ♦ దాఱుజగా
మేరలుపాముకన్దపులి ♦ మెల్పడుకో. ౧౨౬

(కుండలిబంధం, ఉత్పలమాలావృత్తము)

బంగరుపక్కిసాలు వలె ♦ వాటు తటుక్కున వెల్గుసామిలె
స్సంగలవాగు బత్తిమది ♦ సంతసమై లలితారుచు న్మసన్
రంగ నినుం దలంచిరి స ♦ రాసరి గచ్చగునున్న చిన్నిటెం
కింగొన బ్రోవుమయ్య గిడి ♦ గిళ్ళుకిలార్చిన లేమచేగమై. ౧౨౭

## దండకము

సీరామవేల్పా బయల్జేజెలుం బమ్మ యుక్కంటియుం దుగ్గిజక్కు ల్మొదల్గా జగంబంత సన్నెన్నగాజాలరే కారుసనీకలుం బత్తులున్మె చ్చగా నేయుదెవ్లెన్న తొల్రూపు మేన్మినులో మిన్నవై చాలప్రాగబ్బ ముందోచు ప్రావేల్పునుంబట్టి వాలారుముక్కంటు కొమ్ముమందగన్గుర్విన్మ యాబొమ్మకున్మేలు నొందంగ వేసేసితొ వేల్పుఱం రక్కసుల్గూడి పాల్వెల్లినింద్రచ్చుచో నీటు తా మేటిలో మేటవై కవ్వపుంగుబ్బలిన్వీపు నం దాల్చి జేజేలబువ్వ న్వెసన్దీసియిప్పించితో, జాళువాకంటిరాకాసి, నేలన్వడిన్జుట్టి సంద్రంబులో వైవగా జన్నపుంబందవై వాని మారా ముగుర్తించి మన్నిందొలంగించి నీకోరచే నేలలేనెత్తితో, కుఱ్ఱసింజట్టి చెడ్పాటుగావింపకంబంబు నన్మోదివై సింగమై, క్రిందు పాల్మాసి సింబోలి బామందితొల్వేలుపుం బట్టియుం డొక్కసుంజీల్చి రోసంబు పెల్లారఁగా రాబ మొప్పంగ దేవళ్ళనుంగాచితో, గోచి బాపండవై మూడుమాజ్జల్బ లిన్వేడి, నీ నేర్పునుంజూపఁగా బొమ్మగ్రుడ్డుంగడున్నిండి మూడుజ్జలం జూపితో చేతిగొడ్డంటు మొయ్యేదుమారుల్ సెట్క్రోయలంగొట్టి యానె త్తురుం దంద్రికిన్ బిండలిన్వైచి, రాయాదలల్గూర్చి జేజేలమిల్చక్కి కిన్ దంతియగ్లట్టి పెంపందితో, చాలుగా తేలురన్వ్రల్గు పేరింటి రాజేనికిం బుట్టి రాకాసినింజెండి, జన్నంబునుంగాచి మేల్వాజ్జలంబుట్టు దుబ్బన్గలు న్నాతిగాఁజేసి యున్నేలచూలిం గడుంబెండ్లియై మించి రాదారిలో కా వరంగల్గు పాఱున్ గరాళించియుగ్రోబ్బలునుం జీరి తాఁనయ్యయూసన్వడిన్ లంకలోఁజేర సన్నాసులుం బొమ్మచాఱుల్ సిరాబాసలుంగొల్వగా నాకుపాకన్ దగంగొన్ని నాళ్ళుండి యచ్చోటునుం బాసియుం సీతఁగో ల్పోయి తోబుట్టువుం దోడురారుస్యమూకంబుకుం జేరి రేకంటు మేపు ట్టువుంజూచి నెయ్యంబు వాటించి మ్రూన్దిమ్మరుల్ గొల్వ సంద్రంబుపై వంతెనంగట్టి రెండైదులెక్కన్దలల్ గల్గు రాకాసినింజంపి వేవాసినై దో

డుసుక్ తేనిగావించి యున్నేలచూలిన్వాసంగూడియుం బుష్పకంబెక్కి-
దమ్ముఁడునుం గొల్వఁగా వీటికై వచ్చి సంతోసమున్ మమ్మేలిల్లంగ
చుట్టుండురా రాయలుం గప్పముల్వెట్ట, పెంపొందియుం బత్తులంబ్రోచి
తొ, నల్లవల్వన్ మెలంబాల్చియుం బైడిమూలాలిబన్వక్ దొలంగిం
పరాకాసిపాలక్ దగంబుట్టు రారాజులం గొంతిమేపుట్టుకల్ బాసటం
గల్గఁగాఁద్రుంచి నేలన్ సతంబిచ్చుగాదిక్కకన్నయ్య వై చాలఁగాల్గంటులం
న్నేలవా చాలవాఁబ్రోవఁగా, నీవుమేల్మేలుగా బుద్ధరూపుంగడుందాల్చి
నద్దాఁలొ మేటివై దాయలంబోరు నందారునంగొల్వఁగా రావిమ్రా
లోన్నెసలాఁదూటి ప్రావేల్పుయోమారులం గొప్పఁగాదప్పులుం లేని
మేల్నోములున్నోచఁగాఁ జేసి యున్వారిబన్నంబులం బెట్టి మువ్వేటిపే
రింటితోల్వేల్పులం ద్రుంపఁగా ద్రెంపఁగా జిల్వరాదాల్పుకై బాసటన్
జూపితొ, తేజిపై నెక్కి యుండాలుమీరంగ చెన్నంటులాతేఁకులం జీల్చి
నాయంబులం బాటుపూఁబోఁడిపై నాల్గుమాజల్ వడిన్నిల్పితొ, నీకడింద్రై
నచెయ్యెల్ దలంపక్ సురన్మొత్తికై గ్రాలు నిన్నున్నమ్మతిన్గొందరున్ వేడ
గుల్నేరకన్ దొడ్డుగా బిడ్డలన్గొడ్డులన్, మేడలన్మాడలన్గోడలన్జేడెలన్,
కుజ్జలంబజ్జెలం గుఱ్ఱముల్ గల్గు కల్మెల్ తిరంబంచు వేనమ్మి ముత్తింగొనం
లేక నేలన్మతింబుట్టి చావొప్పఁగా వెండితాబుట్టుచున్ జచ్చుచున్ దుం
తరాతుండుపట్నంబుకున్ నేలకుండిర్గగా లేక నిన్నెప్డుజోగుల్ తలంపొ
ప్ప జేజేలుతొల్వేల్పువేఁగంటి చొఁగంటి రేకంటిమేపుట్టు వాకొనినా
యందు నీర్వామిరాయందు మేల్లేటిబాబాయు కాసెద్దడింగాచు విద్ది
మ్మరీడున్ మొదల్గల్గువారెల్ల విన్కొంపుజాబిల్లియున్ జక్కటుల్పక్కి
ముల్పందెలున్నందు పుల్కారులున్వ్రేద్దెలు ద్రొబ్బుదులున్మన్కులు న్గబ్బము
ల్గొలె నాబమ్మగ్రుడ్డంత నీవంచు వేగుండి యున్నమ్మి నీతావునుఁజూచి
వేతారుచుండంగ మెల్నాటికై మేటివై యుండుకన్నయ్య నిన్నెప్డు నీ
చిన్నెలన్దప్పకన్నెంచు నాకన్నెకున్నీదు చెన్నుందగన్జూపి కావంగదె
లచ్చితేడా, జగాపక్కిగోడా జొహారుల్ జొహారుల్జొహారుల్జొహారుల్.

చ. సిరి చెలిమించుగా బొమలు ♦ సింగిడిగా బలులోతు సుద్దులో
యురుములుగాఁ జెలంగ జెలు ♦ వొప్పెడిసల్లని మేనుమ్ర
బ్బుని బరికపుసోనలం గురియ ♦ బల్మరు చేడియ వానకోయిలన్
హారువుఁగ జేరి బ్రోవుము జొ ♦ హారులు వేలకోలంది సేసెదన్.

వ. అనిసంబరంబున నక్కటికి వేల్పుం జేవగా నగ్గించి తన దేవెరి సుద్దివినం జెప్పఁ జిలుకపలుకులకు సరుదుగల సుజువుల సిట్లనియె. ౧౩౦

సీ. వలవంత కారగ్గి ♦ వలన బుట్టినరోజు
వదలిన కెమ్మోవి ♦ వట్టవార
కాటుక నెరయంగ ♦ కన్నవజలకంబు
కాలువలగుచు చ ♦ న్గవను బాఱ
చెక్కటఁ జేర్చిన చేదమ్మి ♦ కాఁకచే
మోము దామర నీటు ♦ మునుఁగువడఁగ
పలుమారు ననపిల్తుఁ ♦ డలరుతూపులఁ గ్రుమ్మ
కదలనిగుండె చీ ♦ కాఁకుఁగాక

ఆ. వె. నవతమీర మోము ♦ ననుచెమ్మటలు వాఱ
తలఁపులోన నిన్నుఁ ♦ దలఁచి తలఁచి
గువ్వగుత్తి కొదవ ♦ కొన్ని మొల్నదువుల
నిన్నుగూర్చి చెప్పి ♦ సన్నుబంచె. ౧౩౧

సీ. ఇగిరించులే మావి ♦ చిగురులచే సొక్కు
కోయిలఁ జేరునే ♦ కొడిశలకును
మిన్నేటి సీటిలో ♦ మేలుగా దిరివెను
యంచలు చేరునే ♦ వెంచలకును
చందురుమామ మేల్ ♦ చంటరి కసుదిను
యేగునే నెలత్రావుఁ ♦ డివములకును

నీటిఁబుట్టుఁగు కమ్మ ♦ నీరుఁద్రావుచు చొక్కు
తుమ్మెదలేగునే ♦ తుమకి గమికి

గీ. నీదుబాగైన యడుగుల ♦ నీరుపుట్టు
పులను నీనవ్వు నీపాట ♦ ఉలదురూపు
లందె నాబుద్ధినిలిచె నా ♦ కన్నులవయి
నానఁజేరదు నీయందె ♦ నచ్చియుండె. ౧౩౨

తే. గీ. మున్నుకల్మల ప్రోయాలు ♦ చిన్నిబోర
నిలచి మనవుము నన్నని ♦ నిన్నువేడి
మరల నీ యంజదమ్ముల ♦ మరువకెలమి
కొసరి యంజల బుక్కాము ♦ గోరెగాదె. ౧౩౩

తే. గీ. వేలుపుల గాచుదేవర ♦ వితము నీవు
నిబ్బరంబున నీకేలు ♦ గబ్బిగుబ్బ
దుగలఁ దలపై నిబెట్టినఁ ♦ దొగల బాసి
నేను మనియెదనేల బి ♦ రానరమ్మ. ౧౩౪

క. నినుఁజూచు కనులతో చ
క్కని వెయ్యవియైనఁ గాని ♦ కననోడును గ్ర
క్కన నీకని పెంచిన మే
యిని నోరులం జేర్పనొల్ల ♦ దెల్లెడనైనన్. ౧౩౫

ఉ. సింగముఁబోలు నెన్నడుము ♦ చెందొవరాయనిమించు మోము మే
లుంగడకంటి చూడుకుల ♦ లో జగమంతయునంకె జేయుచున్
బంగరు దుప్పటంబువలె ♦ వాటుగ వేసిహారంగుమీర నా
కుంగనుబడ్డ రూపుకులు ♦ కున్నెటిఁ గాంచగ నిచ్చజేసితిన్. ౧౩౬

సీ. మొల్ల మొగ్గలసాటి పెల్లగు పల్చాలు
బలుకెంపు మోవిపై ♦ బరుపకున్న

వెడలువుగలబోర ♦ విడి గుబ్బలంటగా
నింపుమై వే కౌఁగిలింపకున్న
నీటి పుట్టుఁగుబోలు ♦ నీ కేలుదుగలను
చెల్వైన కొవ్వునఁ జేర్పకున్న
నిబ్బరికవుచూపులుబ్బగ వెల్లనా
నెమ్మోమ్ముదమ్మిపై ♦ నిలుపకున్న

గీ. నోర్వగాలేను నాయందు ♦ మురువమీర
రమ్మ రావేని యిట నీవి ♦ రాళియగ్గి
చేత నీరైన నిన్వేడ్క ♦ జేసి నీదు
నడుగుదమ్ములకడఁ జేరి ♦ యుండగొందు. ౧౩౭

వ. అని యిట్లు కొన్ని నుడికారంబులగు పోలుపొందు తియ్యని నుడులచే వాక్రుచ్చి యక్కటికవేల్పుం జూచి వెండియు నప్పద్మిని యిట్లనియె. ౧౩౮

క. తొయ్యలి వలుపులు హెచ్చిన
కుయ్యిడుచున్నంత మరుఁడు ♦ కుసుగుంపులుఁగా
తియ్యని విల్లందియు వేఁ
కయ్యానికి కాలుద్రవ్వెఁ ♦ గా కటికవేల్పా. ౧౩౯

చ. సరవిఁగ వెన్నెలంగనిన ♦ జక్కవతీరుకడిందిమబ్బు పెం
పరసిన తూడుతిండిపరి ♦ నక్కట బెబ్బులిఁగన్న లేఁడిమా
దిరి కడి పూలసెజ్జపయి ♦ తీఁగమెలుఁగున కాఁకునొందెనా
విరిహాదనందు దొట్రిలెను ♦ వెచ్చలకాకల కోర్వలేమిచేన్. ౧౪౦

క. దక్కినవుఁ గాలి వీఁవఁగ
పక్కులు వగఁగలుఁగ గూయ ♦ వలదొం నెలలుక్
స్రుక్కగనేసిరి చీమ చి
టుక్కనినన్ నీవటంచు డొంకుచు చూచుక్. ౧౪౧

మ. అనలుం బుట్టుగుఁ గం బసుఁడి నెల చె ♦ ల్వారం గనో గల్గి కే ళ్ దా
ల్పన తెల్మ్రొత్తెపుఁ జాలు నై కళుకు మేల్ ♦ బంగారుఁ తీవే మొ తే
ల్పసలారెన్ సంతల్ల సమ్మొ మొగపా ♦ యిం దాకగాఁ గ్రుక్కె నీ
మనవల్పొందిన గాదె హోవడాల వే ♦ మూరుం బడెన్గన్నయా. ౧౨౨

క. అని హాయలుగ నచ్చెలి సు
ద్దిని విసగాఁ బలుక నల్లఁ ♦ దేసర యెలమిన్
బెనగొనగ చెంబవతో వ
న్నెసఁగల నడికారమసివి ♦ నంబలికె మసన్. ౧౨౩

ఉ. మాపటి ప్రొద్దుగ్రుంకవిను ♦ మా చెలికానినిఁ గూడి నేడు నే
నా పెబిడారు జేరమురు ♦ వారఁగ వచ్చెదనంచు దెల్పు మా
చూపరి పూలవిల్తునకు ♦ స్రుక్కక గట్టితనంబు బూని తా
దూపిలియున్న వద్దమును ♦ తొయ్యలి మేల్రతనమ్ము గ్రద్దనన్.

క. అని పలికి పోవఁ బనిచిన
ననఁబోఁణికయి నొమ్మగిడ్చి ♦ నలమేన్దొరకై
గునపు నగిడి గిల్లిడి గ్ర
ద్దన చెల్మి పడఁతియున్న ♦ తావలమునకై. ౧౨౫

ఉ. వన్నె యొయారి వచ్చి ♦ చెలువంగని ముందటనున్న తీరు తే
కున్న వితాననొంది కెలి ♦ గొందియు కన్నుల తెప్పవాల్ప కే
కన్నియనెల్లఁ జూచి సర ♦ గన్నరసంగల ముద్దుగుమ్మలన్
బెన్నుడి వక్కణించుమని ♦ వేసటఁజేరిన నందటొక్కటై. ౧౨౬

తే. గీ. వరుస వాకొనిరవ్వాడు ♦ వలఁతిమిన్న
కరయుఁ జిగురాకు బాకువా ♦ ఁడనెడుఁ బూవి
సోక నెడలోన సెకసేరి ♦ స్రుక్కి గోడ
గములపాలయి యడిగోలె ♦ కన్నెమిన్న. ౧౨౭

చ. కుడువదు వంటకంబు నెఱి ♦ గొప్పునఁ దాపుల పూవుసోగల
న్నుడువదు రామతమ్ములటు ♦ మ్రోలనుఁ జేరిన నొఱ సుద్దుల
న్నడువదు పూఁగోపునకు ♦ నుం జెలిమూకలఁ గూడియాడఁగా
నడువదు గొప్ప యబ్రములో ♦ నర్చిన నన్వాదికేమి సేతుమో.

ఉ. విప్పదులోవలం గలుఁగు ♦ వేసట నెమ్మెలకెల్ల చిందులన్
జెప్పదు మోముఁ దన్మికయిఁ ♦ జేరఁగవచ్చిన తేటి మొత్తము
న్రొప్పదు నీకునుం గొనదు ♦ రోయును కోయిలపౌజుకుం గను
ల్ద్రిప్పదు నల్లమేనుఁగల ♦ దేవర పచ్చెదు ద్రోఁపుఁజూచుటల్. ౧౨౯

క. ఈ రమణ నిదురలేకయె
సారెకు నిటురట్టుసేయు ♦ సాగెనుఁ బలుకన్
మారాడదు మముఁజూడదు
పేరిమితో నెపుడునిన్ను ♦ బేర్కొను పడఁతీ. ౧౩౦

క. అని పసఁగుఁ జేయు చెలియలు
వినుచు నుడులనాలకించి ♦ పెనుతోయముగాఁ
గనుమారాడక దనపే
రును విసఁబలికినను వీడె ♦ ప్రోయాలు వెఱఁ. ౧౩౧

తే. గీ. కన్నుఁదమ్ములఁ దెఱచిన ♦ ల్గడలనిన్న
నెల్లఁబరికించి యెడ్డలో ♦ నల్లటంబు
నివ్వటిల్లఁగ నచ్చటి ♦ నేస్తపుఁజెలి
మానికంబునుఁ గనుఁగొని ♦ మాటఁబలికె. ౧౩౨

చ. కటకటనన్ను నిట్లుచల ♦ కాఁకను సందరమందు ముంచినీ
వెటకుమిటారి యేగితివె ♦ యెక్కరణిన్ మరులుం దొలంగునె
చ్చటఁజొరుదు న్చిరాననను ♦ సారెకు కౌఁగిలి నీయవెన్నఁడె
న్నటి తరివచ్చునమ్మ విన ♦ నాదగుగంగఁ జెలంగనెల్తుకా. ౧౩౩

ఉ. వెన్నుని చెంతనాకుఁగల ♦ విన్నదనంబును విన్నవించితో
క్రన్నన నిన్ను నేనుమనుఁగ ♦ న్నొని పల్కకమోస పోతివో
విన్నది కన్నయట్లు వినుపిం ♦ చితొ నీదగురాయబారమో
యన్నులమిన్నఁ జెప్పఁగదు ♦ నచ్చొటఁగల్గిన వింతయేర్పడన్.

సీ. అని కటివేల్పు పొం ♦ దున కయివెతలకు
పాదైన కుబ్జనాఁ ♦ బడఁతిఁజూచి
బన్నెవి యిట్లనిఁబలికె ♦ కన్నెరుము
న్నెరుఁగాఁ జేసియు ♦ నీటుకాటు
కనుఁగదుఁగఁగనేల ♦ కడువేడియూర్పుల
వలప వ్రాసోగులు ♦ వాడెసెజ్జ
బారలఁగా నేరని ♦ పోడిమి విడనాడి
గబ్బిగుబ్బెంఁ బూయు ♦ గందములును

గీ. చెదరిపొడిమ్రాలఁ ♦ జెక్కుటఁ జేయిఁజేర్చి
మోముఁ దామరవన్నెలు ♦ మొఱకవడఁక
చెఱఁగు ముసికిడినిట్టుల ♦ చెల్వ కాని
కొఱకు కుందంగ నేటికే ♦ కొమ్మమిన్న. ౧౩౫

క. అని తానుఁబోయికన్న
య్యనుఁ గన్గొని ముచ్చటాడి ♦ యానతిగొనివ
చ్చిన ముచ్చటంత చెలివా
కొని నెలఁతకుఁ దెలిపెఁబూన ♦ గూర్చిన మూడ్కిన్. ౧౩౬

వ. అంతమచ్చకంటితో నిచ్చగా కొన్ని ముచ్చటల నచ్చికగా ముచ్చటించి మఱియు. ౧౩౭

చ. తెలిసితిఁగాని నీవలపు ♦ తెమ్మెరవీఁవ మగండుకిన్కతో
నలరుల కోరుతేయు చెలు ♦ వారగ కోయిలజిల్క సాకెప

ల్లలమటఁ నొందఁగా రొదలు ♦ పాళిగసల్పఁగ సైపలేవుసీ
చెలువలఁగూడి మేడకిక ♦ జేరఁగఁబొమ్మ్మ పరాకుపోల్గనా. ౧౩౮

తే. గీ. ఇటుల నేస్తపుచెలిబల్కు ♦ యింతి మిన్న
చెల్మిపడఁతుక చేదమ్మి ♦ చేయివమ్మి
నిచ్చిపయ్యెట సవరించి ♦ యెలుగుమీర
నంచనడకల వొయ్యార ♦ మెంచనడచి. ౧౩౯

ఉ. మేడకుఁజేరఁబోయి చెలి ♦ మిన్నలకోఁ గొలువుండు సంతలో
వేడుకకాఁడు నల్లమెయి ♦ వేలుపుకొండొక చేడెఁజేరి తా
వేడిమిగొన్న కుబ్జకును ♦ వేళముగానిదె రేయివత్తు నం
చాడినగోలె సంతిపురి ♦ నాయమ పీడియు మిత్తిమించగన్. ౧౪౦

ఆ. వె. వెన్నదొంగ మూన ♦ వినివచ్చి కొలువున్న
చెలువకతెఁదు బుట్ట ♦ చెలిమిగలుఁగ
వేల్పుప్రోడఁజెప్ప ♦ వివరము కొరును
దెలియఁజేసి యేగ ♦ తెఱవమిన్న. ౧౪౧

వ. ఇట్లుఁ దెలియునంత నావగలాడి వగకాసక్తై, మిగుల వగలఁబొగిలి తనలోన. ౧౪౨

ఆ. వె. ఎపుడుఁ బ్రొద్దుగూకు ♦ నెఱచి మేపరిగొంగ
నెపుడుజూతు వలపు ♦ లెపుడు దీర్చు
నెపుడు చందమామ ♦ యేతెంచునో కద
యనుచు పలువితాల ♦ నరయుచుండె. ౧౪౩

వ. అట్టి తోయంబున. ౧౪౪

(సూర్యాస్తమయవర్ణనము)

తే. గీ. వెనుకదెస నీమమేడపై ♦ వేడ్కమీరఁ
రేవెలుఁదుక మెచ్చుతు ♦ రీన పసిఁడి

కుండ సేసియు గొప్రపు ♦ కొనలనుంచె
నోయనంగను చీకటి ♦ దాయ వెలిఁగె. ౧౪౫

క. పడమర కెలఁకుపడంతికి
కడువడితఱి బొజుగుకాఁడు ♦ తలిరుల కెంపుల్
విడివిడిఁ గూర్చిన బంతిని
తడయకఁబంపెనన కలువ ♦ దాయుఁడుఁ గ్రుంకెన్. ౧౪౬

చ. వలకులు నెఱ్ఱవాఱె చెలు ♦ వంబులు తామరలందుఁ దీరె పు
ల్గులగమి చెట్లజేరె నెల ♦ కూటిపులుంగుల సేదఁదేరె బల్
కలువలరోకు మీరె నెల ♦ కల్లులదాటుల నీరులూరె చు
క్కలతెగగేరె కమ్మవిలు ♦ కాడులకోరులనూరె నత్తరిన్. ౧౪౭

ఉ. పేమితమ్మితేనె వల ♦ పింపగ వెన్నెనయన్వలంతి సొం
పారిపఁ జీరఁదాలిచి యొ ♦ య్యారపుఁ జేగురువాయ కెంపులన్
గూలుచు సొమ్ముఁబెట్టుకొని ♦ క్రొత్తసిజాజుల కొప్పుబెట్టినో
నారహిమీర నేలయెఱ ♦ నైనెఱసందెవెలింగి జొబ్బిలెన్. ౧౪౮

తే. గీ. తుంటవిల్తుండు బొజుగుల ♦ తుటుముగరువ
మణపనన విల్లునెత్తిన ♦ యలరు బెళుకొ
తేరునకుఁ గట్టుచిలుకల ♦ తేటుముక్కు
నీటుచాయల నగనొప్పె ♦ నీరుకాళ్లు. ౧౪౯

చ. కలువబొజుంగునా తెలిమె ♦ కంబుల రాయఁడు వేడ్కఁ బుట్టుగు
బ్బలిగ వినుండిలేచి తన ♦ వాడివెలుంగగు చేతిగోరులన్
నిలువక చీఁకటేనుఁగును నెత్తినఁ ♦ గొట్టిన క్రెళ్లి రాలుని
గ్గులుగల ముత్తియంబులను ♦ కోపునచుక్కలువెల్గె తళ్కునన్.

చ. విరిపిడిఁ బొఱి గుబ్బలిగ ♦ విన్నెఱితావులఁ దూఱియుండి బి
త్తరమునుఁగల్గు ప్రొద్దుతురి ♦ తంబున గ్రుంకుడు మొట్టుఁజేరిన

న్చొరిఫురివెచ్చ గాండ్రకుచు ♦ గ్రుచ్చులకానలుఁ బుట్టఁదట్టగా
నిరులటు నిక్కిపిక్కటిలె నేప్పడ ♦ నేరకచ్రంత మిట్టియున్. ౧౫౧

మ. వెలియింత్తెనను లేక ముజ్జగంబులుం ♦ పెంజీకటుల్గ్రిన్న న
త్తలలోనన్ గొమరాండ్రొగిన్నగలతో ♦ దార్కొణఁగా పూలసె
జ్జలపై గూడి పరుండనేసి మనహో ♦ చ్చన్ మిండఁడంజేరి గ్రం
థలహో బున్నరుఁచెయ్యులన్నొలఁగియుం ♦ తం బో బు ిల్ జేరఁగన్.

సీ. మరుఁడు డెరవరుల ♦ మది కానలం గాల్ప
కుప్పఁగా నిల్పిన ♦ నిప్పులనఁగ
విటకాండ్రపై దాడి ♦ వెడలెడు వెడరాఁయు
గ్రోల్లెనపై హొన్ను ♦ కుండయనఁగ
వలపుకాండ్రను మెక ♦ ములపైన వేఁటాడ
దెచ్చిన ననషిల్లు ♦ దీమమనఁగ
వలజేఁడు వలఁగల ♦ వారిగాఁ తనుతీఁగి
యలఁ ద్రెంపనెత్తిన ♦ యలరుగుడుసు

గీ. వాలనఁగ యెఱ్ఱదనమయి ♦ వన్నెనున్న
వరలి తేజులఁగలదియై ♦ వట్రువయయి
పొడుపుగుబ్బలి కొప్పుపై ♦ బొడిచెనంచు
బాజు లలరిన చందురు ♦ డోజఁగలిగి. ౧౫౩

ఆ. వె. చందమామ యాక ♦ సము నెక్కఁ దెసలను
వెల్లఁదనముఁ గలుఁగు ♦ వెలుఁగు లేరు
పడియె నలువగ్రుడ్డు ♦ వడిగ నిండినకప్పు
రంబు క్రోవివస గ ♦ నంబడియెను. ౧౫౪

వ. మఱియు నపొడుపుకొండనుండి కొమారుండుఁ బుట్టిన వేఁడుకను
నాకసము నొరయు తరఁగలచే మమ్మతిల్లు పాలసందరంబు వెల్లి
వొడిచి పుడమి కడువడి యెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు

లెక్కలేనిదియై యెనిమిదికడల నలుముఁబడి మిన్నేటి సెలయే
రులనుండి పైఁడిమూఁకాలి వలంతిక్కి దిగ్గురాయుంచల సోగుల
గూఁడిని తగ్గులేని పుటపుటనవిచ్చిన తెల్లఁగలువల ప్రోఁగులుంగల
కేళాకూళుల చెంగటను పొదలాడుచు కలగాముపాపఁమియను
గవియందు జొచ్చుట యచ్చెసంబునుంబోలె మేడలదాపు నుర
తాణి తవంపు గుండ్రని కిటికీలందూఱు పైచీఁకటి క్రొక్కారు
తుద యగుటవలన తెల్లు పెంపారి పూచెనోయన విరివిఁగల
వెల్లువల నొడ్డులం గ్రాలుచు ననలచాలుల పోలిక నేలపుట్టుఁగుల
తీవియల యాకులం దళతళరువాణంబుల వెలయుచు కొందమసిం
గపు కూనలతీరున క్రొండకొప్రంబులెక్కుచు మనఁజెలంగ జల
కంబునం దేలియాడు వాలుగల మేలగు బెళుకులంబోలి సోయ
గంబున నందంబుగల పెన్నేటితరగల చెలువారి యులచందిరిక
మిక్కిలి గరగరగల తెల్లని చెన్నుగలదియై వెన్నెలపులుంగుల
నోట నెరయుచు చందమామనీములోఁ గల తేటివాయినుండి
నెమరువేయఁగ జారిన మిక్కిలి ముమ్మతిల్లు నురుగుపుంజిక వరుస
నేర్పాటుగల పువ్వుటీరంబులపయిం దిరువులాడుచు కమ్మనితావి
వెదజల్లెడునను చు మల్లెపూగుత్తుల సంతోసంబు రెట్టింప సిట్టట్లు
తొలుదొల్త కూడికచే నలసి వలపుకాండ్రను నీసడించి పైకూ
టమి నెఱుపు తెఱవలఁ సుగముజాఁబుచు న్నరువాణంబుల తెఱం
గునన్ కురంగట కరంగి తొరఁగు నెలకల కిట్టడంపు నేల జలజలం
జాఱుచుండు వెల్లఁ దనంపు నీటి తళుకుక్కలం గలసి కూడుకొనుచు
రింగున న్నెగసి వినుదారిరంగారు నేల కొడుకుగాముపగడంపు
రిక్కలు గోలెగాములు రిక్కలింగంబులని గుటుకు గుటుక్కన
మ్రింగఁ గడంగుతతఱి పెద్దగా గుఱియుమనుచు వెల్లువ వరుస నీటి
దారకు నింపుగా గుంపులై యాకసంబున క్షుత్తుకకొలఁది ద్రావి

క్రిక్కిరియున్నాయిం బట్టి యొక్కటి కొక్కటి కందిచ్చుచు విచ్చలవిడిన మచ్చికలం గలయు చెలుఁద్రావుల నొయ్యారంబును నాలుమగలు పటికపు కోరల న్మోవలుంచిన నారికడము కల్లునా నచే బుచ్చుకొని దాని రిమ్మవలన గలుగుకొన్న సంతోసంబు సందడింప వినువారి వీనుల కింపగునటుల బాడు నెక్కువతక్కువ పాటలచేత దబ్బాటుమాటల నక్కజంబు పొందించు నాటలచే వంకరలగు మాపుసేతల లలించు వైనములేని చిరునవ్వులం జెలంగి మెలంగుచు తెలివంది పరాకువదిలి మగలుఁజెంది నొకరి కొకరు ప్రేముడిసేయుచు రతనపుటందియలు మ్రోతమ్రోయఁగా పువ్వుపు పెద్దపొవ్వులకుం బోయి తోటనుండు కమ్మతెమ్మెరలు వీఁచి, కుతినీపయ్యెదలు దోలంగింపకయున్న జారిపోవ న్బసుపు పచ్చని నిమ్మకాయలవంటి బంగారు లేకులుకుగుబ్బ గవలం దళతళలాడునట్లు గాన్పించు సొగసైనపౌడ లుబ్బుకొనం దబ్బిబ్బు లెడలం దబ్బున కౌఁగిలించు మెఱుఁగుఁబోడుల కన్గవలకొనల గన లుచున్న మెఱుంగులు రాణించు సింగారపు సేతలకు సంతసించు ప్రేముడి మగలతో పెనుగులాఁడి పలువితంబుల కూటములన్ గల నేరుపులతో చేరి మునునిదురంబున సయ్యాటలాడి తాప చుండు నవ్వాడు పోయగంబుచే తళతళక్కుమని గ్రాలెడు మగ రాలదుద్దుల పాపెటఁ బొట్టు చకచకలతో చెలిమిసేయుచు నిట్టు తగ్గులేని తెల్లని చాయలు నిండుకొని మెండుగా పండువెన్నెలలు గాయుచుండ మరుండు కరంబుగా విరికటుకుటమ్ముల మరమ్మ సేయ కినుకౌరదాయమై కమ్మతెమ్మెరలుదాయ నుల్లంబు జల్లు జల్లుమని తల్లడిల్ల నిద్దురనోంపక మిగుల మొత్తని జిగురుపాన్పు నుండి డిగిచెరలాడు పెనుగాలిచే దూలి పూవతీఁగెయుమాదిరి సోలుచు కుబ్జకన్నె కరతనంబు నతంబు మంతనంబున తలంపు

సేయు సిరిపెనిమిటియగు కన్నయ్య యొడలి సింగారంబు కన్నులఁ
గట్టిన ట్లైనఁ జూపితి చూచితని జ్వరునలేచి బయలం గౌఁగిలిం
చుచు నదివట్టి కైన కళవళించుచు నక్కటక్కటా మాల
దైవంబు కట్టడియయ్యె నేనేమి సేయుదుననుచు కన్నుంగవనుండి
జారుచున్న నీరు సెలయై యురఁగడగడ వడంకుచున్నంతలోన.

ఉ. అవ్వుడు నల్లమేనిదొర ♦ యూరట మొందెను కుబ్జచెంతకున్
దెవ్వునఁబోవఁగాఁ దలఁచి ♦ తీరగుపొమ్ములఁ దాల్చి మేననీ
టొప్పఁగ యుద్ధవుండనెడు ♦ నొక్క నిమిత్తునిఁ గూడిచేడె మే
లుప్పరిగంబుత్రోవ చెలు ♦ వొందగ నాతఁడుఁదీయుచుండగన్. ౧౫౬

క. చనిచని కట్టెదురంగను
గానెమరునిం గన్నతండ్రి ♦ కోల్కొను సారము
ద్దనలారు వీనెవిద్దెన్
జిగిరవల వెలుంగుగద్దె ♦ చెలువఁగు మిద్దెన్. ౧౫౭

వ. కనిలోఁ గిలికింజనిన నచ్చేడియ యెదురుఁగా నడచి పారునంబు
బుద్దిలో బెనంగొన నక్కజివేల్పునంజదమ్ముల వన్నిటి జిలకంబు
నంగడిగి నన్నని దువ్వలువచే దడియొత్తి నిద్దాబంగరు రతనాల
గద్దియపైఁ గూరుచుండబెట్టి వెంబడించివచ్చిన యుద్ధవుండనెడు
నేస్తకానికిఁ దగిన పూజలొనరించి దురబందులు మొదలగు
మేలోగిరంబుల సాపడంబెట్టి నెచ్చెలులతో నచ్చెలువ యార
గించి మరియు, ౧౫౮

క. జవ్వాది కప్పురపుకడి
నివ్వటిలం జెమ్మలందు ♦ నెఱిదివ్వెలతో

మవ్వముఁగల పడుకఁగదిన్
జివ్వన కరివేల్పుతోడఁ ♦ జేరె చెలువయున్. ౧౫౯

వ. ఇట్లు నప్పడుకఁగది మ్రోలకరిగి వెండియు, ౧౬౦

చ. పగడపుకోళ్ల మంచమును ♦ బల్కుతి నీపనిమించు పాన్పుపై
నిగనిగలాడు దోమతెర ♦ నిక్కఁగచక్కని నిల్వుటద్దము
లొప్పఁగనగు మెత్తలుఁదివ్వెగల ♦ సూదినిచందువ ముత్తియంపుచే
ర్లుఁగలిగి తేజునొందులలి ♦ లోఁగిలికిం జని చూచిరప్పుడున్. ౧౬౧

సీ. మంచిగందపుకోర ♦ మరిజాలవల్లిక
వట్టివేళ్లసురంటి ♦ వన్నెగదుర
జవ్వాదివక్కణి ♦ సంపెంగనూనె గిం
డులుపిల్లిగడ్డలు ♦ తళతళమను
సిరిమించు రతనాల ♦ చిలుకల దివ్వెకం
బంబులు కప్పుఁ ♦ బరణిపచ్చ
కస్తురిపెట్టెయు ♦ కాళంజికడిగల
వన్నెఁటిక్రోవియు పసిఁడిపీట

గీ. బలితమగునేన్గు వలుతోటి ♦ పనిదనర్చు
దువ్వెనక డానిచెంబులు ♦ నివ్వటిలిన
పడుకటిలుఁజూచి కన్నుల ♦ పండువైన
వచ్చరామెట్లుఁగలపూల ♦ పాన్పుఁజేరి. ౧౬౨

శా. దయ్యంబౌకటివేల్పు కుబ్జయొకనే ♦ దందీర కేల్దమ్మితో
నొయ్యారంబు నకౌఁగిలించి తమితో ♦ నోజస్నునుం బల్కులన్

వెయ్యార్లాడుచు సోబియంబు గుఱిక ♦ న్వేఁడి యీయ్యవిల్దారి మేల్
కయ్యంబున్వివరింప మెచ్చుకోనియె ♦ న్గాదారి మూఁదారిలోన్.

క. పొక్కిలిచన్గవ కుత్తుక
చెక్కిలికెమ్మోవి కనులఁ ♦ జెవ్వఫుమోముఁన్
నిక్కువముగ ముద్దులుఁగొని
చక్కగ తమయిచ్చసుగముఁ ♦ జరిపెడు తలలో. ౧౬౪

చ. సరివయికూటమిం జెలువ ♦ నల్పుచునుండఁగ వింతవేలుపుం
దెరవసియూడె చుక్కలొగి ♦ తిన్నసవీడ్వడి చిక్కులొందె సం
బరమున గట్టులున్వడికె ♦ బల్మరుచందురుఁగప్పె బ్బుబ్బుల
చ్చెరువుగనీరుబొట్లువడి ♦ సెన్మతిమించులుమించెనాడుచున్. ౧౬౫

తే. గీ. ఇటుల పలువితాల ♦ హెచ్చుగ వలపుల
కలయికలనుఁ దేలి ♦ కలికికటీయు
మేనివేల్పుతోడ ♦ మెత్తని నడుపుల
చెంగనాలుఁదాను ♦ జేసిపలికె. ౧౬౬

తే. గీ. నీదుచిట్టంటువుల చేత ♦ నీదుమేని
వలపులకు నాదుడెందంబు ♦ వరగలించె
నన్నికోరికలీయ క ♦ న్నయ్య తగును
వేరువేలుపు లిట్లుగా ♦ వింపఁగలరె. ౧౬౭

మ. లలియా నీయొడలిం దలంచి సిరివా ♦ లాయంబు నిన్వేడు కొం
దులకో నే నిమసంబు నిన్ను విడువన్ ♦ తోరంపు వూవిల్తు విం
దులలో నిండిన వేడ్కఁజూపి వలపు ♦ ట్లోరియంగ నీ కల్మికిన్
దులలేదే వివరింపగా నలవియే ♦ తోడ్తోడ నీ సత్తువన్. ౧౬౮

తే. గీ. కానఁ నేఁ గోరుకోర్కెలఁ ♦ గలుఁగఁజేసి
మనువుమని వేడుకొనెనన ♦ మారుపాటు
నొందియడిగిన కుబ్జను ♦ డెందమందు
కత్తిమనుమఁడు రసికి న ♦ క్కజముఁగననె. ౧౧౯

ఆ. వె. పోరుతిండి తపసి ♦ మొదలుగాగల రసు
లెదనుఁదలఁచి చూడ ♦ కుదురులేని
వేల్పు నెట్లుగోరె ♦ వెలఁదుక విరివిల్తు
పోరఁగవయు నట్లు ♦ లోరుసిలలి. ౧౨౦

క. దొరకఁడు సిరికౌఁగిటిలో
దొరకండలఁ జోగికలువ ♦ దొరలకు నెపుడున్
దొరకఁడు వేల్పులకైనను
దొరికెన్వలరాయు తండ్రి ♦ తొయ్యలికి నొగీ ౧౨౧

క. తొలిచదువుల కందనియా
తొలిమాసిసి జేజెజేజ ♦ దొరికిన యంతన్
దెలివిఁగల ముగితిఁగోరక
నలరాచ వనిన్మెలంగ ♦ వలెనని గోరెన్. ౧౨౨

ఆ. వె. పిల్లతనములోన ♦ పెంచిన తల్లిచే
కట్టుబడిన యట్లు ♦ కనికరమున
లేమకౌఁగిలింత ♦ లోమిన్నయైఁ జిక్కె
నేమివుసెమొ తొల్లి ♦ నోములేనొ. ౧౨౩

ఆ. వె. ముజ్జగంబులేలు ♦ ముప్పోకలానిని
కోరుకున్న చెలికి ♦ కోర్కెలిచ్చి

గాచుకొనెనో లేక ♦ కపటునపుంచెనో
తెలియఁబలుకు మనినఁ ♦ దిరిగినుడివె. ౧౭౪

ఉ. నీవనుమాటలన్నియుని నిక్కము ♦ బత్తులబత్తి నెడ్డలో
గావఁగ నీవెయంచనెడు ♦ కర్నకమున్నని నంతలోవలన్
బోవకయుండునే యతని ♦ బుద్దిసిగల్గిన కోర్కెలీయకే
దేవరయుండు నేమనకు ♦ తెల్లముగావలవేల్పు చెయ్యముల్. ౧౭౫

ఆ. వె. ఔరవాని చెట్ట ♦ నమరఁగఁ బట్టిన
గొల్లకన్నెకలువుఁ ♦ గొనిరి మురితి
యతడు కేలబట్టి ♦ సతముఁబోచెడు వారి
కరయ కలుసమన్న ♦ నలనుఁగలడె. ౧౭౬

ఆ. వె. చుట్టమయ్యెఁగాని ♦ నూడు చేతనుగాని
కలఁతనైనఁగాని ♦ కలసిఁగాని
బగితినైనఁగాని ♦ బల్మోరువానితో
పొందుసేయఁగలుఁగు ♦ ముందు మురితి. ౧౭౭

క. మునుకలవమియ్యతనుదా
ల్చిన ప్రేముడిపెను కులాడ ♦ చినిమగవనిలో
తనిననునుండు మటంచని
వినిపించిన నంతసించి ♦ వెన్నుడువేడ్కన్. ౧౭౮

ఉ. కోరినకోర్కె లిత్తునని ♦ కుబ్జముడెన్నుఁడు నిండువేడ్కపెం
పారఁగ బల్సగంబులను ♦ పొలిసెలంగిఁగ గబ్బిగుబ్బలన్
బోరున నంటకౌఁగిలిడి ♦ పూవిలుకానిదురంబునైనమున్
మేరలచాలఁ దెల్పిచెలి ♦ మిన్ననుఁగూడి పరుండె నంతటన్. ౧౭౯

చ. కలువలు మోముమూసె కడ ♦ గండ్లకు తావగు చంపమాపు
ల్గులమదిరోసె, జక్కవల ♦ గోములఁబోవిడి గ్రేఁకసేసె చు
క్కలగమిమాసె, తామరలు ♦ క్రన్నఁ జెఁబాసె, బిరానకోడికం
పుఱెఁక దమిఁగూసె పక్కులట ♦ పోఁడిమి చెట్లనుఁబాసె సంకటన్.

మ. కుఱుకున్నిద్దపు చెక్కుటన్నొనయము ♦ నొక్కల్ వేసలిగ్రాచిత
మ్ములముల్తాపుకిలించి బోకమిఱుఁదలం ♦ బొంకంబుగా గట్టిని
చ్చలు సొంపొందఁగ ముంగుఱుల్నిమిఱిరియై ♦ చ్చన్నంకియుం గోరన
త్తలబీతిన్వారి పాన్పులండిగిరి జేం ♦ డ్లంచాలులేయుంజొగిన్. ౧౫౧

తే. గీ. పాయమును గల్గుతన్నిమే ♦ ప్రాయుని మది
మెచ్చిరే రాజువినుచెలి ♦ మిన్నుముదుక
డనుచు క్రిందుగ బడద్రొబ్బి ♦ నల్లమూము
పాలెపడమటి కొండపై ♦ బాజులెడలి. ౧౫౨

క. గందపు మలనెత్తమ్ముల
కందువమేల్తీవయిండ్ల ♦ కడివిరి పాన్పున్
జెంది సుగించిన చెంచుల
యందపుచన్గవ జవాది ♦ యంది సురలాగిన్. ౧౫౩

క. తారాడుచుండ పజలను
కూరుకు విడనాడి మేలు ♦ కొనుటకు తానే
కోరికలేపెడు వాడన
తూరుపుఁదెస వేఁగుజుక్క ♦ తురుతునఁ బొడిచెన్. ౧౫౪

తే. గీ. బమ్మచారులు మొదలైన ♦ బాపలెల్ల
మేలుకాంచి సతంబును ♦ మెలఁగదగిన

నేతలను తానమూడియు ♦ నేమములర
సందెగిడిగిళ్లు సలిపిరి ♦ సరిఁగబగిది. ౧౮౫

తే. గీ. చెలియకుబ్జను కన్నయ్య ♦ చేరిమరుని
రంతులనుదెల్పి నిమురించె ♦ రానఁజెలఁగ
మేలుకొలుపఁగఁ దగునని ♦ మించివచ్చి
కొక్కొరకొయంచు కోళ్లటఁ ♦ గూసె పొలుచ. ౧౮౬.

ఆ. వె. వినుతకొడుకుఁ గలుఁగ ♦ వెలసిన యపదము
తోడసిరివెలుంగ ♦ తొడరుబాయ
నందితూర్పు కొండ ♦ నలరె ముప్పొకల
తారుచున్న వేల్పు ♦ తళుకులెసఁగ. ౧౮౭

ఆ. వె. ప్రొద్దుఁబొడువ తమ్మి ♦ పొక్కిలి మేలొకని
తానమాడుపనుల ♦ తమకమునను
దీర్చి సుగముగదుర ♦ తిరుగుచు లేకల
గమినిఁబ్రోచుచుండె ♦ గారవమున. ౧౮౮

చ. కుమరితమైన కుబ్జయొకఁ ♦ గోరినయట్టుల వెన్నుఁదొంగ వ
చ్చి మరులుమాన్పి యింటఁబసఁ ♦ జేసికోమలు డెంతొ పిన్నవే
డ్కమది జెలంగ బత్తిమెయి ♦ కారును గద్చుచు సంతసించియుం
డె మరుని గన్నతండిరికి ♦ డిందగు పేరులనెంచి నెమ్మిగన్. ౧౮౯

మ. సనకుందు న్నొదలైన జోగులెదలో ♦ సంతోసముంజెంది చూ
చినఁ గానంబడనట్టి వేల్పునకుఁ దా ♦ చేసమ్మెంగ గల్గుచ
క్కని గంధంబుల నిచ్చినందులకు వే ♦ గవచ్చి మన్నించె క్రొ
న్ననవిల్దారిగలంచి నెల్తుకనురా ♦ నంగొన్ని నాళ్ళుండియున్. ౧౯౦

చ. ఇటువలె కుబ్జవెన్నునకు ♦ నేడ్తెఁబానిసె చెయ్యులెల్లయూ
రటఁగొనకే యొనర్చుచుత ♦ రల్పగ సత్తువలేని బాగెముల్

బటువుగనొంది పాటలర ♦ వాళులు హెచ్చఁగ సెజ్జగీములో
చిటిపొటిమాట లన్నొగని ♦ చిక్కనిరంతులఁ జిక్కియుండఁగన్.

క. ఏ వేసట లేకుండఁగ
పూవిల్తుని పోరులోనఁ ♦ బూవిల్తునకున్
బూవిల్తుఁడైన కన్నయ
తో వేడుకనుండె కొడుకు ♦ తొరలుట కొరకై. ౧౯౨

సీ. కన్నయ్యయనిబ్బరి ♦ కనుఁజూపులో కుబ్జ
పడఁతికి దనయొక్క ♦ పాలువలన
మంచికారున నెల ♦ మనసెనుగొంతికి
మోమున తెలుపెక్కె ♦ ముడుతవిప్పె
బొజ్జను తడఁబడె ♦ బుడిబుడి నడ[illegible]లు
కోర్కులు మెండ[illegible]క్కె ♦ కులుకులెడలె
బోనముపై యిచ్చ ♦ బొత్తిగ లేదయ్యె
చిట్టుముల్బలిసెను ♦ చిట్టుకముఁగ

గీ. వంగడము నిల్చుటకు నయి ♦ వరలుచున్న
కొమరితనుఁ జూచి కములియు ♦ కోమలుండు
నంతసంబను సంద్రము ♦ నొంతొనోల
లాడిరి నెలంత వేవిళ్ల ♦ తోడ మెలఁగె. ౧౯౩

వ. ఇట్లు తొమ్మిది నెలలు జరుగునంత నొక్కసోబన మూరుతమ్మున గాములు తమతమ సొంతపుతావులను మూడాడువదనకొండ వతానకంబుల కొందరుండ నొక్కకొమారుండుఁ గలిగె నతనికి పెద్దల నొడబాటుచే నుపశ్లోకుండను పేరుతో నలరారె వాడుఁ దన తండిరియైన కన్నయ్య యడుగుఁదమ్ములఁ గొలుచుచు నా శ్వేరపురుసిచందురునకుఁ జట్టి బానిసముఁ గావించుచు మిక్కిలి

యక్కజంబుగాఁ దెలియందగిన తెలివినిఁ దెలిసి యతం డాఁడు వారిని నాలవకొలంబువారిని బానిసె మొదలగు వజలకుఁ జక్కఁ జేయఁదగినదియై మిక్కిలి తలంచినంతనే ముగితిం గలుఁగనేయు నట్టి (సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి) యనెడు పొత్తముఁగలి గించె. నదిమొదలు నేటివరకు కన్నయ్య బగితిఁగలవారికి విడువ రాని పాడియై నలరారె. కావున నీ కతరతనము నేరికై ననుడివిన నుడువగవినిన చెప్పించిన బాగుఁగలవారికి వెన్నుండున్న మెల్నాడు గలుగును. ౧౯౪

వ. అనుచు శుకుడుకత్తి ♦ మహమునికిని కుబ్జ
కతను నునువులైన ♦ కమ్మనైన
నుడువులడరఁజెప్పె ♦ క[illegible] పరిక్షీంత్తుండు
చెవులు చవులునొ[illegible]గి జెలిసె. ౧౯౫

సోబనములు నరసింగా
సోబనములు వేల్పుగొండ ♦ నుద్దిగలబసా
సోబనము లచ్చిటేడా
సోబనములు వేల్పుపెద్ద ♦ చూలిపొగడ్తా. ౧౯౬

అడుగులజాలుకుందనపు ♦ టందపుసాలుకడిందిము త్తికిం
బొడవగుప్రోలుతమ్మినెల ♦ వుంగలనెత్తుకయాలుఁబత్తులం
గడువడిబ్రోచుకేలుబరి ♦ గంథడగించెడు చుట్టువాలుమై
బెడగుల ప్రబ్బుకాలు గల ♦ ప్రెగ్గడరక్కసిమాత్తిసింగమా. ౧౯౭

(తోటక వృత్తము)

తొగకంటువు కం ♦ దుడు దేవరలు
న్బొగడ నరితనం ♦ బుల పోణిమనం
దగువేలువు గొం ♦ డను తానకమై
మిగుల న్వొలిఁజిమ్మ ♦ న మేల్బిరుదా. ౧౯౮

(౧౯౬౯. విక్రమార్కశకం).

క. కననవషణ్ణ వశశిసం
ఖ్యానిగుడఁగల విక్రమార్క హాయనమున సా
గెనుకీలకమాఖ సితచతు
ర్థినినీకవితను ముగించితిని మెచ్చ బుధుల్.

(గద్య.)

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబక
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘుల్ చక్రవర్తుల తంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతంబైన
అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసం
బను సింగారకబ్బంబు నందు
తృతీయాశ్వాసము సర్వం
సంపూర్ణం. శ్రీకృష్ణ
పరబ్రహ్మణేనమః.
శ్రీమతేరా
మానుజా
యన
మః
శ్రీ